Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 83 • సంచిక: 15 • 12-4-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# సబిత స్థానంలో సునీతాలక్ష్మారెడ్డి?

## ● కళంకిత మంత్రులకు కిరణ్ అండాదండా...



తన పొలంలో తాటి చెట్టుకు కల్లు గీశారని ప్రతిపక్షాలు ఆరోపిస్తే, మంత్రి పదవికి రాజీనామా చేశాడు పాత నెల్లూరు జిల్లాకు చెందిన ఒక పెద్ద మనిషి. ఆయన పెద్ద భూస్వామి. తన పొలం హద్దు లేవో కూడా తెలియదు. తనకు తెలియకుండా జరిగినా, మద్య నిషేధ చట్టానికి అది ఉల్లంఘన కాబట్టి నైతికబాధ్యత వహించాడాయన. ప్రైవేట్ బస్సుల జాతీయకరణలో సుప్రీంకోర్టు తాను తప్పు చేశానని వ్యాఖ్యానించింది కాబట్టి ముఖ్యమంత్రి పదవికే రాజీనామా గోకి పారేశాడు నీలం సంజీవరెడ్డి. మెడికల్ కాలేజీ కేటాయింపులో ఆశ్రిత పక్షపాతం జరిగిందని కోర్టు చేసిన వ్యాఖ్యతో నేదురుమల్లి జనార్ధనరెడ్డి కూడా ముఖ్యమంత్రి పదవి పరిత్యజించాడు. ఇవి రెండూ విధానపర నిర్ణయాలు. సంజీవ రెడ్డికి కానీ జనార్ధనరెడ్డికి కానీ ప్రత్యక్ష లబ్ధి అంటూ ఏదీ లేదు. కానీ రాజకీయాలలో నైతికత ఆ తీరులోనే వుంటుంది. ఇప్పుడు రోజులు మారిపోయాయి. రాష్ట్ర ప్రభుత్వంలో ఇద్దరు మంత్రుల మీద సిబిఐ ఛార్జిషీట్ నమోదు చేసింది. వైఎస్.జగన్ అక్రమఆర్జనలో భాగస్వామ్యం వుందనే ఆరోపణ చేసింది. మరొక ముగ్గురు మంత్రుల మీద కూడా రేపో మాపో అభియోగాలు నమోదయ్యే అవకాశం కన్పిస్తు


కొరవ 14వ పేజీలో






స్వర్గీయ యేటూరు సుబ్బరామిరెడ్డి గారు
మరణం : 03-04-2013

## ఉత్తరక్రియలు

మూర్తీభవించిన మానవత్వం, పరిమళించిన ప్రేమామృత హృదయంతో మా జీవితాలలో వెలుగులు నింపిన తేజోమూర్తి, మా మనో మందిరాలలో దివ్యదీప్తి మా ఇంటి దైవం శ్రీ యేటూరు సుబ్బరామిరెడ్డి గారు తేది 03-04-2013 బుధవారం నాడు స్వర్గస్తులైనారు. వారి పవిత్రాత్మకు శాంతిని చేకూర్చాలని భగవంతుని ప్రార్థిస్తూ... శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

భార్య : యేటూరు సుబ్బమ్మ
కుమారుడు - కోడలు : వై.వి.రామిరెడ్డి - విజయలక్ష్మి
కుమార్తె - అల్లుడు : వాల్మేటి సరిత (పద్మ) - శ్రీనివాసులురెడ్డి
మనుమలు - మనుమరాండ్రు : శిల్పారెడ్డి - కమలాకరరెడ్డి (స్విడ్జర్లాండ్)
సింధురెడ్డి - నరేంద్రరెడ్డి (U.S.A)
అనూషరెడ్డి B.Tech, అఖిలరెడ్డి B.Tech
మునిమనుమలు : హన్సిత్‌రెడ్డి, పన్విత్‌రెడ్డి

పెద్దకర్మ : తేది 17-04-2013 బుధవారం నెల్లూరు నారాయణరావుపేట (పాత మునిసిపల్ ఆఫీసు దగ్గర) లోని మా స్వగృహమునందు జరుగును. బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

# ఎందుకీ వాచాలత్వం?

ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అధ్యక్షుడు మార్కండేయ కట్జూ ఈ మధ్య తరచూ వార్తలకెక్కుతున్నాడు. నిత్యం ఏదో ఒక అంశం మీద వివాదాస్పద వ్యాఖ్యలు చేయడంలో రాజకీయవాదులను మరపిస్తున్నాడు. మార్కండేయ కట్జూ ఉత్తరప్రదేశ్‌కు చెందిన వ్యక్తి. సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి. న్యాయవ్యవస్థలో ఆయనకు ఉన్నతమైన గౌరవం వుంది. నిప్పు వంటి నిజాయితీ పరుడన్న పేరు ప్రఖ్యాతులున్నాయి. ఆయన పత్రికా రచయిత కూడా. ప్రముఖ దినపత్రికలలో వర్తమాన సంఘటనలపై పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు వ్రాస్తూ వుంటాడు.

అంతవరకు బాగానే వుంది. కానీ సుప్రీంకోర్టు నుంచి రిటైర్ అయిన తర్వాత ఆయన మాటల వాడి, వేడి పెరిగి పోయాయి. ఒక రకంగా చెప్పాలంటే వాచాలత్వమనే బలహీనతకు లోనైనట్లు కన్పడుతున్నది. ప్రెస్ కౌన్సిల్ అనేది గౌరవ ప్రదమైన సంస్థ. పత్రికా రంగంలో నైతిక ప్రమాణాలు పెంచడానికి ఉద్దేశించింది. ప్రజాస్వామ్యంలో పత్రికలకున్న స్వేచ్ఛను దెబ్బ తీయకుండానే, పత్రికలు స్వయం నియంత్రణ పాటించేందుకు ప్రయత్నం చేయడం దాని బాధ్యత. ఎంతో సున్నితమైన, నిగ్రహంతో కూడిన వ్యవహారశైలి ద్వారానే అది సాధ్యమౌతుంది. కానీ మార్కండేయ కట్జూ ఆ పదవి ద్వారా వచ్చే ప్రచారాన్ని తన వాచాలత్వానికి వినియోగించుకొంటున్నాడు. “దిన భూమి” అనే తమిళ పత్రిక సంపాదకుడి కేసు విషయంలో ఆయన జయలలితను రాజీనామా చేసి ఇంటికి వెళ్ళమని హుంకరించాడు. ఈ సంపాదకుడి కిడ్నాప్‌కు కారకులైన 30 మంది పోలీసులను అరెస్ట్ చేయాలని అది చేతకాకుంటే ముఖ్యమంత్రి జయలలిత రాజీనామా చేయాలని మాట్లాడారాయన. ప్రతికలకు సంబంధించి ఒకే సమయంలో రెండు పరస్పర విరుద్ధ వ్యాఖ్యలు చేశాడు మార్కండేయ కట్జూ. మొదట భారతీయ పత్రికలు ముస్లిం మతస్తులు మొత్తాన్ని దేశ ద్రోహులుగా వర్ణిస్తున్నారని విమర్శించాడు. ఆ వెంటనే భారతీయ పత్రికలు భగవాన్ హనుమంతుడి వలె శక్తివంతమైనవని ప్రశంసల వర్షం కురిపించాడు. మరొక సందర్భంలో పాకిస్తాన్ ఒక నకిలీ దేశమని, ఏదో ఒక రోజు పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లు భారతదేశంలో విలీనం కాక తప్పదని వ్యాఖ్యానించాడు. సుప్రీంకోర్టు న్యాయమూర్తి హోదాలో వున్న వ్యక్తి, దేశ దౌత్య వ్యవహారాలపై ప్రభావం పడే రీతిలో వాచాలత్వం ప్రదర్శించడం విచారకరం.

ఆయన ఇటీవల ఒక కొత్త సంస్థను స్థాపించాడు. ప్రజల సేవకు ఉద్దేశించిన ప్రయత్నం ఇది. దాని పేరు సత్యం భూయాత్. అంటే సత్యమే చెప్తాము అని. దాని ప్రధాన లక్ష్యం కోర్టు ఆఫ్ లాస్ట్ రిసార్ట్. భారత న్యాయ వ్యవస్థలో అన్యాయమే ఎక్కువగా నడుస్తున్నదని కట్జూ భావన అట. దాని పరిహారమే ఈ సంస్థ ఉద్దేశమట. సరైన న్యాయ సహాయం దొరక్క జైళ్లలో మ్రగ్గుతున్న వేలాది మంది అభాగ్యులు తమ సంస్థ వద్దకు గుంపులు గుంపులుగా వస్తారని అంచనా వేస్తున్నారాయన.

దేశంలోని 80 శాతం మంది హిందువులు, 80 శాతం మంది ముస్లింలు మత పిచ్చి పట్టిన వాళ్లని వ్యాఖ్యానించాడు కట్జూ. 90 శాతం మంది భారతీయ ఓటర్లు వెధవలని, గొర్రెలని తీవ్రంగా మాట్లాడాడు. భారతీయ ఓటరును ఎందుకు గొర్రెల మందగా భావిస్తున్నాడో, హిందు ముస్లింలను ఎందుకు మతతత్వ వాదులుగా పరిగణిస్తున్నాడో తెలియదు. ఎవరో దారినపోయే దానయ్య ఇటువంటి పిచ్చి ప్రేలాపనలు చేస్తే వూరకుండ వచ్చు. కానీ ఉన్నత స్థానంలో, అత్యున్నత హోదాలో వున్న వ్యక్తులు ఇట్లా ప్రేలాపనలకు దిగడం దేశానికి ఎంత మాత్రం శ్రేయస్కరం కాదు. అటువంటి వాచాలత్వాన్ని ఖండించడం ప్రజాస్వామ్య వాదులందరి కర్తవ్యం. నరేంద్రమోడి మీద, అరుణ్‌జైట్లీ మీద కూడా వెటకారాలు ఆడాడు కట్జూ. న్యాయవ్యవస్థలో భాగస్వామిగా మెలిగే వాడికి రాజకీయ వాదుల మీద వ్యక్తిగతంగా వ్యాఖ్యలు ఎందుకు?

కట్జూ వ్యక్తిత్వం గొప్పదే. కానీ ఆయన వాచాలత్వం మాత్రం గర్హనీయం. ఒకరికి నీతులు చెప్పే స్థానంలో వున్న వారు ముందు ఆ నీతిని తాము పాటించాలన్న విజ్ఞత ఆయనలో కలగాలని కోరుకొంటున్నాము. లేని పక్షంలో ఆయన నోటి దురుసుతనాన్ని నిరోధించడానికి న్యాయ మార్గం అనుసరించక తప్పదు.

## జనవాణి

### టౌన్‌హాల్‌లో దోమలు వాస్తవమే!

'జమీన్‌రైతు' మార్చి 26వ తేది సంచికలో టౌన్‌హాల్‌లో దోమలు జాస్తిగా ఉన్నాయని, మైకులు సరిగాలేవని వ్రాశారు. టౌన్‌హాల్ బయట విశాలమైన స్థలం, చెట్లు జాస్తిగా ఉన్నందున హాల్‌లో కార్యక్రమాలు జరిగే సమయంలో దోమలు జొరబడి పోతున్నవి. ఫాగింగ్ మిషన్ మాకు సాధ్యపడని విషయం. అప్పటికీ రైతు డిపో వారి సలహాతో ఈ మధ్య ఓ మందు స్ప్రే చేయించినాము. ఫలితం కోసం ఎదురు చూస్తున్నాము. ఇటీవలే మైకు సిస్టమ్‌ను మూడు లక్షల రూపాయలు పెట్టి బిగించాము. టౌన్‌హాల్‌లో వివిధ కార్యక్రమాలు ఏర్పాటు చేసుకొనేవారు జెయింట్ స్పీకర్లు పెడుతున్నారు. దీనివల్ల సౌండ్ సిస్టమే మారిపోతుంది. ఈ విషయమై టౌన్‌హాల్ పాలకవర్గం చేయగలిగిందేమీ లేదు.

ఏ.వి.కృష్ణారెడ్డి — నెల్లూరు

### వెంకటగిరి – సోమసానిగుంట!

వెంకటగిరికి నైరుతి మూలలో బొగ్గులమిట్ట ఉంది. వాయువ్య మూలలో బ్యాండుపాళెం, ఎగువ అరవపాళెంలు ఉన్నాయి. పడమర దిక్కున సోమసానిగుంట గ్రామం కలిసి పోయి వుంది. బొగ్గులమిట్ట, బ్యాండుపాళెం, ఎగువ అరవపాళాలు సోమసానిగుంట పంచాయితీ పరిధిలోనే ఉన్నాయి. అటువంటి సోమసానిగుంట పంచాయితీని వెంకటగిరి పురపాలక సంఘంలో విలీనం చేయకపోవడంలో అర్థం లేదు. దీన్ని తప్పించి తొమ్మిది పంచాయితీలను విలీనం చేయాలని ప్రభుత్వానికి ప్రతిపాదన పంపారు. అంటే ఈ ప్రతిపాదన పంపిన వారికి వెంకటగిరిని గూర్చి సమగ్ర అవగాహనలేదని అర్థం. ఇప్పటికైనా చేసిన తప్పును దిద్దుకోవాలని అధికార్లకు విజ్ఞప్తి చేస్తున్నాను.

పి.సత్యనారాయణశెట్టి — వెంకటగిరి

### వాస్తవ పరిస్థితులను విశ్లేషించిన వ్యాసం!

'జమీన్‌రైతు' మార్చి 22వ తేది సంచికలో అమెరికాపై కక్షతో భారత దేశంపై తరచూ తీవ్రవాద దాడులు శీర్షిక పేరిట వ్రాసిన ప్రత్యేక వార్త విశ్లేషణాత్మకంగానూ, వాస్తవానికి దగ్గరగానూ వుంది. దేశ విభజన జరిగాక భారతదేశంలోనే ఉండిన ముస్లిం సమాజాన్ని జాతీయ జీవన స్రవంతిలో కలిపే ప్రయత్నం దేశ నాయకత్వం చేయలేదు. వారిని రెండవ తరగతి పౌరులుగానే చూస్తూ స్వార్థ రాజకీయాల కొరకు ఉపయోగించుకొంటూ వచ్చారు. ఓటు రాజకీయాల కోసం ఏవేవో రాయితీలు ప్రకటిస్తూ వచ్చారు. జాతిపిత మహాత్మా గాంధీ గారు సైతం స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో అందరూ కలసి దేశ స్వాతంత్ర్యం కోసం ఆంగ్లేయులపై పోరాడుదాం అనకుండా మీరు మేము కలసి పోరాడదాం అని విభజించి మాట్లాడారు. ఇప్పటి ముస్లిం మత పెద్దలు అంటే ముల్లాలు, మౌల్వీలు ముస్లిం సమాజానికి ఆలోచించే అవకాశం ఇవ్వక కేవలం

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

16-4-1943
పేజీలు : 8 వెల: అణా

### జమీన్‌రైతు సహాయ సంపాదకుని అరెస్టు!

మా పత్రిక సహాయ సంపాదకులు కె.ఎల్.ఎన్.సింహా గారు నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలో కాపురమున్న యింటిని 14వ తేది పోలీసులు సోదాజేసి 'స్టూడెంటు' అనే పుస్తకాన్ని తీసుకొని, వార్ని అరెస్టు చేసి నవాబుపేట పోలీస్ స్టేషన్‌లో ఇంకా ఉంచి యున్నారు.

### రంధ్రాన్వేషి

వెంకటగిరి రాజాగారి పేరుతో నెల్లూరు కాలేజి స్థాపించబడినా, పాలన మాత్రం నడమంత్రపు పెద్దమనుష్యుల చేత కమిటీ పేరుతో సాగింపబడుతున్నది. ఈ కమిటీ ప్రతి విషయంలో నానా అంకచంఢాలం చేస్తున్నది. వీరి పుణ్యానవే(కాలేజికి దమ్మిడి యివ్వని దాతలు)ఫస్టు గ్రేడు కాలేజి నేలపాలైంది. సరేపోనియ్యండి. దీని పాలన ఎంత అధ్వాన్నంగా వున్నదో చూడండి. కమిటీ తీర్మానాలను అమలు జరిపేది సెక్రటరీ. దీన్ని ఇప్పుడు సమయానుకూల సనాతనులు, రావుసాహెబు బిరుదానికి కారణమైన రెడ్‌క్రాస్ సేవా దురంధరులు, ప్రజానీకంపై నిందలు మోపే – అంటే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లేండి వవ్వేటి వి.రావు గారు అలంకరించి వున్నారు. కానీ కమిటీ ఆజ్ఞలు వీరు చాలా తిరస్కరించి వున్నా కమిటీ వారు వీరిని మందలించలేకున్నారంటే తిరుమలేశునికి గూడా తెలియని భావం ఇందు ఏదో వుండి తీరాల. కిరోసిన్ దొంగలించిన వారిని డిస్మిస్ చేయనున్న కమిటీ తీర్మానాన్ని ముడ్డి క్రింద(అశ్లీలం కాదులెండి) వేసుకొని కూర్చో వుంటే కమిటీ ఏమి చేయదలచుకొన్నదో!

విశ్వాస రాహిత్య తీర్మానం సెక్రటరీ పైన తెస్తాం చూడు అని ఒక మీసాలులేని కోమటోళ్ల అబ్బాయి అంటాడు. చూస్తంగా ఆ రసవత్తర ఘట్టం గుడా!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

12-4-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు

#### సంజీవయ్య

కాంగ్రెస్ అధ్యక్షుడు దామోదరం సంజీవయ్య ఈ రోజు రాత్రి 8 – 9 ప్రాంతంలో బద్వేలు నుండి నెల్లూరు చేరి, రాత్రి మెయిల్‌లో సర్కారు జిల్లాల పర్యటనకు పోతున్నారు.

#### ఉరిశిక్ష

నెల్లూరు తాలుకా, దువ్వూరువారిపాళెం మజరా రావిపాడు గ్రామానికి చెందిన 12 ఏండ్ల గొల్ల పిల్ల నగలు అపహరించి, ఆ బాలిక గొంతు నులిమి హత్యజేశాడని, దువ్వూరువారిపాళెం వాసి సందు సుబ్బరామయ్యపై మోపబడిన నేరాన్ని జిల్లా సెషన్సు జడ్జి ఎ.ఎల్.నరసింహారావు గారు విచారించి ముద్దాయికి ఉరిశిక్ష విధిస్తూ ఈరోజు(12వ తేది) తీర్పు జెప్పారు. ప్రాసిక్యూషన్‌కు శ్రీ సారంగపాణి; ముద్దాయి పక్షంగా ప్రభుత్వ నియమిత న్యాయవాది పాపారావు గారలు వాదించారు.

#### కాకుటూరు నరసింహారావు కాలధర్మం

విఆర్ హైస్కూల్ రిటైర్డ్ హెడ్మాస్టరు కాకుటూరు నరసింహారావు గారు 11వ తేది రాత్రి 10–15 గంటలప్పుడు పొగతోటలోని వారి స్వగృహంలో హఠాత్తుగా మరణించారు. నరసింహారావు గారు హెడ్మాస్టరుగానే గాక, తన ఉదార హృదయంతో, నిష్పాక్షపాతంతో అందరి ప్రేమాభిమానాలను చూరగొన్న వ్యక్తి, గౌరవనీయుడు. అన్ని సంవత్సరాల తన ఉపాధ్యాయ జీవితంలో వారు ఒక విద్యార్థికి అపకారంగానీ, ఒక విద్యార్థిని నొప్పించడంగానీ చేసి ఉండరు. అంతటి దయార్ద్ర హృదయం వారిది.

# నెల్లూరు ముచ్చట్లు

## బంద్ పాక్షికం!

విద్యుత్ ఛార్జీల పెంపు, కరెంట్ కోతలను నిరసిస్తూ ఐదు విపక్షాలు తెలుగుదేశం, వైకాపా, సిపిఎం, సిపిఐ, బిజెపిలు ఇచ్చిన పిలుపు మేరకు 9వ తేది నెల్లూరు నగరంలో బంద్ పాక్షికంగా జరిగింది. అన్ని పార్టీలు బంద్‌లో పాల్గొన్నా ఆర్టీసి బస్సులు, ఆటోలు, ద్విచక్ర వాహనాలు తిరుగుతూనే కనిపించాయి. స్కూళ్లు పూర్తిగా, వ్యాపార సంస్థలు కొద్దిసేపు మూతబడ్డాయి. వాస్తవానికి ఈ బంద్ బ్రహ్మాండంగా జరగాలి. విద్యుత్ ఛార్జీల పెంపు ఎంత భారం? కానీ దీన్ని ప్రజలు లైట్‌గా తీసుకొన్నట్లుంది.

## ముఖ్యమంత్రి మెచ్చిన నెల్లూరు!

నెల్లూరు అల్లుడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డికి ఈ నెల 1, 2, 3 తేదీల్లో చేపట్టిన ఇందిరమ్మ బాట విజయవంతం కావడంతో ఎక్కడలేని జోష్ వచ్చింది. దీంతో ఈ నెల 14వ తేదీ మరోసారి నెల్లూరు రాను సమాయత్తమయ్యారు. సూళ్లూరుపేట నియోజకవర్గ పరిధిలోని ఏదో ఒక హరిజనవాడలో ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళికపై చర్చ పెడుతున్నారాయన. ముఖ్యమంత్రి పర్యటన విజయవంతం చేసే బాధ్యతలను శాసన మండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి స్వీకరించారు.

## దినేష్‌రెడ్డికి రామదూత పిచ్చి!

నెల్లూరీయుడు, గతంలో ఆదర్శ భావాలు మెండుగా ఉండిన డిజిపి వేణుంబాక దినేష్‌రెడ్డికి రామదూతస్వామి పిచ్చి పట్టింది. ఈ స్వామి ఆశ్రమంలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో పాల్గొ నను 6వ తేదీన నెల్లూరు వచ్చారాయన. పనిలో పనిగా పోలీసు అధికారులతో ఓ సమావేశం, పాత్రికేయులతో ముచ్చట్లు, గొలగమూడి వెంకయ్యస్వామిని దర్శించి 7వ తేది హైదరాబాద్ తిరిగి వెళ్లారాయన. ఈ మధ్య ఏడుకొండల స్వామిని దినేష్‌రెడ్డి దర్శించుకొన్నారు. మళ్లీ ఈ రామదూత స్వామి దర్శనమేమిటో? దీనికిగాను దినేష్‌రెడ్డి అధికారిక పర్యటన నిమిత్తం నెల్లూరు రావడమేమిటో?

## డిఎస్ రాక

పిసిసి మాజీ అధ్యక్షుడు ధర్మపురి శ్రీనివాస్ 6వ తేది నెల్లూరు వచ్చి నారాయణ మెడికల్ కాలేజి అతిథి గృహంలో బస చేశారు. వ్యక్తిగత కార్యక్రమాల నిమిత్తం నెల్లూరు వచ్చానని తనను కలసిన విలేకరులకు డిఎస్ చెప్పినా అది వాస్తవం కాదు. ఈయన సైతం రామదూత స్వామి దర్శనానికి వచ్చినట్లు తెలిసింది.

## జయప్రద, అమర్‌సింగ్!

సమాజ్‌వాదీ పార్టీ ఎమ్పీలు సినీనటి జయప్రద, అమర్‌సింగ్‌లు 6వ తేది సూళ్లూరుపేట చెంగాళమ్మ, కాగితాలపూరులోని నాగేంద్రుని దర్శనానంతరం గూడ్లూరుకు సమీపంలోని రామదూత స్వామి ఆశ్రమానికి వెళ్లారు.

## కావలిలో కోట్ల!

కేంద్ర రైల్వేశాఖ సహాయ మంత్రి కోట్ల సూర్యప్రకాష్‌రెడ్డి 6వ తేది కావలి, బిట్రగుంట రైల్వేస్టేషన్లను పరిశీలించారు. రైల్వే బిట్రగుంట పూర్వ వైభవానికి తనవంతు కృషి చేస్తానన్నారు. ఆయన వెంట అల్లూరు మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి ఉండినారు.

## విద్యుత్ కోత వేళలు మారాయి!

నెల్లూరులో 8వ తేది నుంచి విద్యుత్ కోత వేళలు మారాయి. గతంలో ఉదయం 6.30 నుంచి 8.30 వరకు విధిస్తుండిన విద్యుత్ కోతను 9 గంటల నుండి 11 గంటలకు మార్చారు. ఉదయం పూట ఎండ తీవ్రంగా ఉంటుంది. ఈ సమయంలో కోతకు జనం అల్లాడి పోతున్నారు.

## తీక్షణంగా భానుడు!

భానుడి తీక్షణతకు జనం అల్లాడి పోతున్నారు. 5వ తేది 40 సెంటీగ్రేడ్ డిగ్రీల ఉష్ణతాపం నెల్లూరులో నమోదయ్యింది. పెరగడమే కానీ భానుడి తాపం తరిగే ఛాయలు కానరావడం లేదు. విద్యుత్ కోత, భానుడి ఉగ్రరూపం మధ్య జనానికి ప్రత్యక్ష నరకం కనపడుతుందనడం నిజం.

## విష్ణు ఇంటికైనా వెళ్తా!

రాజకీయాలు ఎన్నికల ప్రచారం వరకే పరిమితమని అభివృద్ధి పనుల విషయంలో తాను విష్ణువర్ధన్‌రెడ్డి ఇంటికి వెళ్లి చర్చించను కూడా సంకోచించనని కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు ప్రకటించారు. 7వ తేది అల్లూరులో ముఖ్యమంత్రి మామ ఆర్‌ఆర్ రమణారెడ్డి నిర్మించిన రుద్రభూమి ముక్తిధామ ప్రారంభోత్సవ కార్యక్రమంలో మస్తాన్‌రావు మాట్లాడారు. కలెక్టర్ సహకరిస్తే తాను కూడా కావలి నియోజకవర్గంలోని కొన్ని రుద్రభూముల అభివృద్ధికి తనవంతు చేయూతనందిస్తానన్నారు.





## నెల్లూరు నెం.1 అల్లూరు నెం.2

రాష్ట్రంలో నెల్లూరు నగరంలో ఉన్న అత్యాధునిక స్మశాన వాటిక ఎక్కడాలేదని ఎస్పీ బి.వి.రమణకుమార్ చెప్పారు. అల్లూరులో సిఎం మామ, బెంగుళూరులో ఆర్‌ఆర్ హోటళ్ల అధినేత కరవళ్ల వెంకటరమణారెడ్డి నిర్మించిన అత్యాధునిక స్మశాన వాటిక ప్రారంభోత్సవంలో పాల్గొని మాట్లాడారు. అల్లూరులో రమణారెడ్డి నిర్మించిన స్మశాన వాటిక రాష్ట్రంలోని ఏ గ్రామంలో ఉండదని కితాబిచ్చారు. తలా ఒక చేయి వేస్తే ప్రతి గ్రామంలోనూ ఇటువంటి ఆధునిక స్మశానవాటికలు నిర్మించవచ్చున్నారు.

## బాద్‌షా టిక్కెట్ వెయ్యి!

5వ తేది విడుదలైన బాద్‌షా సినిమా టిక్కెట్ తొలిరోజు వెయ్యి రూపాయలకు బ్లాక్‌లో విక్రయించారు. క్లాస్, మాస్ హాళ్లనే తేడా లేకుండా ఈ బ్లాక్ టిక్కెట్ల అమ్మకాలు కొనసాగాయి.

## నెల్లూరులో మహిళా కేంద్ర కారాగారం

ప్రస్తుతం నెల్లూరులో నడుస్తున్న సెంట్రల్ జైలును మహిళా కేంద్ర కారాగారంగా మారుస్తూ జైళ్ల శాఖ ఉన్నతాధికారులు నిర్ణయం తీసుకొన్నారు. సెంట్రల్ జైలులోని ఖైదీలను మే మొదటి వారానికి చెముడుగుంట వద్ద కట్టిన ఓపెన్ ఎయిర్ జైలుకు మార్చాక దీన్ని మహిళా కేంద్ర కారాగారం చేయనున్నారు. రాష్ట్రంలో ఇప్పటివరకు మహిళా కేంద్ర కారాగారం లేదు. నెల్లూరులోనే దీనికి శ్రీకారం చుట్టనున్నారు.

## డయల్ 100

రాష్ట్రంలో ఎక్కడైనా శాంతి భద్రతల సమస్య ఉత్పన్నమైతే 100కు ఫోన్‌చేస్తే 60 సెకన్లలో అక్కడకు పోలీసులు చేరుకునే వ్యవస్థకు ఉగాది నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి శ్రీకారం చుట్టనున్నారు. డిజిపి దినేష్‌రెడ్డి మానస పుత్రిక డయల్ 100 పథకం. సెల్ లేదా ల్యాండ్ ఫోను నుంచి 100కు ఫోన్ చేస్తే హైదరాబాద్‌లోని డిజిపి ఆఫీసుకు వెళ్తుంది. అక్కడ నుంచి జిల్లా పోలీసు కార్యాలయాల్లో ఏర్పాటు చేసిన డయల్ 100 సెల్‌కు ఈ కాల్ సమాచారమందుతుంది. ఇక్కడ నుంచి పోలీస్ స్టేషన్లకు సమాచారం వెళ్తుంది. అయినా పోలీసులు ఇంత త్వరగా స్పందిస్తారా అనేది సందేహం. నెల్లూరు ఈ కొత్త

కొరవ 14వ పేజీలో





# నెల్లూరు పోలీసులు బాగా పనిచేస్తున్నారు!



విలేకరుల సమావేశంలో డిజిపి, ఎస్పీ.

## డిజిపి దినేష్‌రెడ్డి ప్రశంస

నెల్లూరు పోలీసుల పనితీరుపై పోలీస్ బాస్ డిజిపి దినేష్‌రెడ్డి మరోసారి ప్రశంసల జల్లు కురిపించారు. 6వ తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లోని ఉమేష్ చంద్ర కాన్ఫరెన్స్ హాల్‌లో ఆయన విలేఖరులతో మాట్లాడారు. మీడియా సోదరులు తరచూ నెల్లూరు పోలీసులను నిందిస్తూ కథనాలు వ్రాస్తున్నారు. హరనాథపురంలో జరిగిన తల్లీకూతుళ్ళ హత్య విషయంలో పోలీసులు ఏం తప్పిదం చేశారు. దుత్తలూరు మండలం సోమలరేగడలో జరిగిన హత్యల పరంపరలో కుటుంబ సభ్యుడే హంతకుడు. ఇందులో పోలీసుల నిర్లక్ష్యం ఏమిటి? మీరే చెప్పండని ప్రశ్నించారాయన. పోలీసులు నిజంగా తప్పు చేస్తే ఉపేక్షించేది లేదు. కష్టపడి పనిచేసే పోలీసు అధికారులు తప్పకుండా ప్రోత్సహించాల్సిన అవసరం ఉందన్నారు. నెల్లూరులో కొత్తగా పోలీసు కార్యాలయాన్ని కట్టను ప్రతిపాదనలు సిద్ధమయ్యాయన్నారు. బొల్లినేని హాస్పిటల్ సమీపంలోని అంబేద్కర్ నగర్‌లోని పోలీస్ క్వార్టర్స్ ప్రాంతంలో దీన్ని కడతామన్నారు. కొత్తూరు సమీపంలో పోలీస్ క్వార్టర్స్ నిర్మాణానికి ఐదెకరాల స్థలాన్ని ప్రభుత్వం కేటాయించిందన్నారు. జిల్లాలో చైన్ లింక్ స్కీమ్‌లో నగదు కట్టి మోసపోయిన బాధితులందరికీ న్యాయం జరిగేలా చర్యలు తీసుకొంటామన్నారు. ఈ సమావేశంలో గుంటూరు రేంజ్ ఐజి రవికుమార్ గుప్తా, ఎస్పీ బి.వి.రమణకుమార్, ప్రకాశం జిల్లా ఎస్పీ పల్లె రఘునాథ్‌రెడ్డి, గుంటూరు అర్బన్ ఎస్పీ రవికృష్ణ, నెల్లూరు అదనపు ఎస్పీ ఎల్.టి.చంద్రశేఖర్ తదితరులు పాల్గొన్నారు.

# ఇందిరమ్మ బాట ఖర్చు రూ.13 కోట్లు!



పర్యటనకు హెలికాప్టర్ దిగుతున్న సిఎం.

## సిఎం పర్యటనా? మజాకానా?

ఈ నెల 1 నుంచి 3వ తేది వరకు రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.కిరణ్‌కుమార్‌రెడ్డి జిల్లాలో పర్యటించిన సందర్భంగా చేసిన ఖర్చు దాదాపు 13 కోట్ల రూపాయలు. మూడు రోజులపాటు ఇక్కడే బసచేసి పలు ప్రారంభోత్సవాలు, శంకుస్థాపనలు చేశారు. నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, చిత్తూరు జిల్లాల నుంచి భారీ సంఖ్యలో బందోబస్తు నిమిత్తం పోలీసులను రప్పించారు. సిఎం పర్యటించిన ప్రాంతాల్లో కిలో మీటరుకు ముగ్గురు పోలీసుల్ని నియమించారు. సిఎం పర్యటనలో పాల్గొనేందుకు వివిధ శాఖలకు చెందిన రాష్ట్రస్థాయి అధికారులు నెల్లూరుకు వచ్చారు. అంతే కాకుండా రాష్ట్ర పౌర సంబంధాల శాఖ కమిషనర్ దానం కిషోర్ హైదరాబాద్ నుంచి ప్రత్యేక ఎసి బస్సులో మీడియా బృందాన్ని నెల్లూరుకు తీసుకొచ్చారు. సిఎం బసతోపాటు మంత్రులు ఇతర అధికారులు, వాహనాల అద్దె, ఇంధన వినియోగం, సభావేదిక నిర్వహణ, సంక్షేమ పథకాల సమీక్ష కోసం లబ్ధిదారుల తరలింపు, భోజన ఏర్పాట్ల కోసం కోట్ల రూపాయల నిధులు ఖర్చు చేశారు. సంక్షేమ పథకాల సమీక్ష కోసం లబ్ధిదారులతో సిఎం ముఖాముఖి మాట్లాడేందుకు డిఆర్‌డిఏ, డ్వామా, రాజీవ్ యువ కిరణాలు, వైద్య ఆరోగ్య శాఖాధికారులు ప్రజలను తీసుకు వచ్చారు. వీరికి రవాణా సదుపాయం, భోజన సదుపాయాల పేరుతో లక్షల రూపాయల నిధులు చేతులు మారాయన్న ఆరోపణలు వున్నాయి. అలాగే సర్వేపల్లి సమీపంలో కృష్ణపట్నం పోర్టుకు వెళ్లే రహదారి ప్రక్కన ఇదే శాఖ ఏర్పాటుచేసిన సభకు తోటపల్లి గూడూరు, ముత్తుకూరు మండలాల నుంచి మహిళలను వంద రూపాయలిచ్చి ఆటోల్లో తరలించారు. ఇందిరమ్మ బాట కోసం కోట్ల రూపాయలు ఖర్చు చేసినట్లు లెక్కలు తయారు చేసిన అధికారులు మహిళలకు భోజనం, త్రాగునీరు సరఫరా చేయలేక పోవడం సిగ్గుచేటు. మొత్తంమీద సిఎం పర్యటన దొంగ లెక్కలతో దోపిడీకి ఉపయోగపడింది.

# జిల్లాలో నిఖార్సుగా ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్ అమలు!



## జిల్లా కలెక్టర్ ప్రకటన

ఎస్సీ, ఎస్టీ సబ్ ప్లాన్ అమలులో భాగంగా ఏ ఒక్క అర్హుడికైనా అన్యాయం జరిగితే కఠినచర్యలు తప్పవని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి అధికారులను హెచ్చరించారు. ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక-2013కు సంబంధించి నెల్లూరులోని స్వర్ణవేదిక కళ్యాణ మండపంలో 6వ తేది జిల్లా, మండలస్థాయి అధికారులకు అవగాహన సదస్సు నిర్వహించారు. ఈ సందర్భంగా కలెక్టర్ మాట్లాడుతూ అభివృద్ధి చెందిన సమాజం ఎస్సీ, ఎస్టీ జనాభాకు మధ్య ఉన్న అంతరాన్ని తగ్గించడమే ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక ప్రధాన లక్ష్యమన్నారు. జిల్లాలోని ప్రతి మండలంలో 40 శాతం కంటే ఎస్సీ, ఎస్టీ జనాభా కల్గిన ప్రాంతాలను ముందుగా గుర్తించాలన్నారు. ఎమ్పిడిఓ, తహశీల్దార్, ఆర్‌డబ్ల్యుఎస్, హౌసింగ్, ఎస్ఆర్ఈజీఎస్, ఐకెపి అధికారులతో కూడిన బృందం ప్రతి ప్రాంతానికి వెళ్లి అక్కడ నివసిస్తున్న ఎస్సీ, ఎస్టీల కనీస అవసరాలను గుర్తించి ఎప్పటికప్పుడు ఆన్‌లైన్‌లో నమోదు చేయాలన్నారు. దీని కోసం 8వ తేది నుంచి 30వ తేదీ వరకు సంబంధిత ప్రాంతాల్లో పర్యటించాలన్నారు. ఈ పర్యటనలో హౌసింగ్, తాగునీరు, ఇందిర జలప్రభ, పింఛన్లు, రహదారులు, కాలువలకు ప్రాధాన్యతనివ్వాలన్నారు. ఎస్సీలకు కేటాయించే గృహాలకు ప్రస్తుతం ఇస్తున్న 60వేల రూపాయలను లక్షకు పెంచామన్నారు. ఈ సమావేశంలో జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, ఎజెసి పెంచలరెడ్డి, డిఆర్వో రామిరెడ్డి, ఆర్డీఓ మాధవీలత, ఎస్సీ కార్పొరేషన్ ఇడి సోమయ్య, డిఆర్‌డిఏ పిడి వెంకటసుబ్బయ్య తదితరులు పాల్గొన్నారు.

# రెవిన్యూ డివిజన్ కేంద్రాలు కావాలా? వద్దా?

## ప్రజాభిప్రాయ సేకరణ మొదలు

నెల్లూరు జిల్లాలో మరో రెండు రెవిన్యూ డివిజన్లను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పటికే వున్న నెల్లూరు, కావలి, గూడూరు రెవిన్యూ డివిజన్లతోపాటు ఆత్మకూరు, నాయుడుపేట డివిజన్ కేంద్రాలుగా ఏర్పాటు కానున్నాయి. దీనికి సంబంధించిన ప్రక్రియను వెంటనే ప్రారంభించి 30 రోజుల్లోగా ప్రజల నుంచి అభ్యంతరాలను స్వీకరించాలని ఆదేశాలు జారీ అయ్యాయి. పరిపాలన సౌలభ్యం కోసం జిల్లాలో తొలుత ఆత్మకూరును డివిజన్ కేంద్రంగా ఏర్పాటు చేయాలని భావించారు. ఆత్మకూరును రెవిన్యూ డివిజన్ కేంద్రంగా ఏర్పాటు చేసినట్లు జిల్లా మంత్రి వివిధ సభల్లో ప్రకటించి వున్నారు. కానీ అధికారికంగా ప్రభుత్వం నుంచి ఎటువంటి ప్రకటన వెలువడలేదు. ఇటీవల ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వుల్లో ఆత్మకూరుతోపాటు నాయుడుపేటను కూడా రెవిన్యూ డివిజన్‌గా ఏర్పాటు చేస్తున్నట్లు పేర్కొన్నారు. ప్రస్తుతం వున్న 46 మండలాలను విభజిస్తారు. గూడూరు డివిజన్‌లో వున్న మండలాల్లో కొన్నింటిని నాయుడుపేటకు, కావలి, నెల్లూరు డివిజన్లలో వున్న మండలాలను ఆత్మకూరులో విలీనం చేస్తారు. నెల్లూరు నగరాన్ని మరో మండలంగా ఏర్పాటుచేయాలన్న ప్రతిపాదన వుంది. ఈ అంశం చాలా సంవత్సరాల నుంచి ప్రభుత్వం వద్ద పెండింగ్‌లో వుంది. కొత్తగా ఏర్పాటుచేసే రెవిన్యూ డివిజన్లతోపాటు నెల్లూరు అర్బన్ మండలాన్ని ఏర్పాటు చేయాలని ప్రజలు కోరుతున్నారు.

# ఐసిడిఎస్ సామాగ్రి కొనుగోళ్లలో చేతివాటం!

## ఉన్నతాధికారులు పర్యవేక్షించాలి మరి!

జిల్లాలో 17 ఐసిడిఎస్ ప్రాజెక్టుల పరిధిలో నిర్వహిస్తున్న అంగన్‌వాడీ కేంద్రాలకు అవసరమైన సామాగ్రిని కొనుగోలు చేసేందుకు స్త్రీ, శిశు సంక్షేమ శాఖ నిధులు విడుదల చేసింది. ఒక్కో కేంద్రానికి 500 రూపాయలు అంగన్‌వాడీ వర్కర్ బ్యాంకు ఖాతాలో జమ చేశారు. ఈ నిధులతో కేంద్రానికి సంబంధించిన బక్కెట్, చీపుర్లు, సోపులు, ఇతర సామాగ్రిని కొనుగోలుచేసి బిల్లులు, రశీదులు సంబంధిత సిడిపిఓ కార్యాలయంలో సమర్పించాలి. కానీ ఇక్కడ సిడిపిఓ, సూపర్‌వైజర్లు కుమ్మక్కై అంగన్‌వాడీ వర్కర్ల బ్యాంకు ఖాతాలో జమచేసిన నిధుల్ని తీసుకుని వీరే కొనుగోలు చేసి సరఫరా చేశారు. వీరు కొనుగోలు చేసిన నాసిరకం సామాగ్రి 300 రూపాయలకు మించదు. అంతే కాకుండా నగరంలో హోల్‌సేల్ డీలర్లను సంప్రదించి అన్ని కేంద్రాలకు అవసరమైన సామాగ్రి తెప్పించుకున్నారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం అంగన్‌వాడీ వర్కర్లు సామాగ్రిని కొనుగోలు చేయాలి. కమీషన్లకు కక్కుర్తిపడి సిడిపిఓ, సూపర్‌వైజర్లు వ్యాపారుల అవతారం ఎత్తి నాసిరకం సామాగ్రిని అంటగడుతున్నారు. మొత్తం సామాగ్రిని ప్రాజెక్టు కార్యాలయానికి తెప్పించి కార్యకర్తలకు అందజేశారు. వీటిని గ్రామీణ ప్రాంతాలకు తీసుకువెళ్లేందుకు ఆటోలను ఆశ్రయించి చేతి డబ్బులు చెల్లించుకోవాల్సి వచ్చిందని కొందరు వాపోయారు. ఇదిలా వుండగా ఇటీవల కేంద్ర ప్రభుత్వం అంగన్‌వాడీ కేంద్రాల రికార్డుల్లో కొన్ని మార్పులు చేయడం జరిగింది. పాత రికార్డుల్లో కొన్నింటిని తొలగించి కొత్త రికార్డులను సరఫరా చేసింది. వీటికి రూ.600 వసూలు చేస్తున్నారు.

## విచారించి చర్యలు తీసుకుంటాం

అంగన్‌వాడీ కేంద్రాలకు సిడిపిఓ, సూపర్‌వైజర్లు సామాగ్రిని కొనుగోలుచేసి సరఫరా చేయరాదు. అంగన్‌వాడీ వర్కర్లకు అందించిన 600 రూపాయలతో వారే నిర్ణయించిన వస్తువులు కొనుగోలు చేసి రశీదులు కార్యాలయంలో ఇవ్వాలి. రికార్డులకు సంబంధించి కూడా ఎటువంటి నగదు వసూలు చేయకూడదు. ఏ ప్రాజెక్టులో సిడిపిఓ, సూపర్‌వైజర్లు వస్తువులు కొనుగోలు చేశారో విచారించి అటువంటి వారిపై శాఖాపరమైన చర్యలు తీసుకోవడం జరుగుతుందని పిడి విజయలక్ష్మి తెలిపారు.

● పోలీస్, రెవిన్యూ శాఖల మధ్య

# పేకాట గలాట!

కావలి ఆర్ఐ అరెస్ట్‌తో రగడ

కావలి పట్టణంలో పేకాట ఆడుతూ ఆర్ఐతో సహా పలువురు పోలీసులకు పట్టుబడడం సంచలనం కల్గించింది. గత కొంతకాలంగా పట్టణ పరిధిలో పలు ప్రాంతాలలో పేకాట జోరుగా సాగుతోంది. ప్రభుత్వ ఉద్యోగులు, చోటామోటా నేతలు పలువురు ఈ కేంద్రాల్లో పేకాట ఆడుతుండడంపై పోలీసులకు పలుమార్లు సమాచారం అందినా పట్టించుకోకుండా వున్నారు. కొందరు పోలీసులకు, పేకాట కేంద్రం నిర్వాహకులకు మధ్య లోపాయికారి ఒప్పందాలు వుండడంతో పోలీసులు దాడికి వస్తున్నారన్న సమాచారం ముందుగానే అందుకొని అంతా చక్కబెట్టేస్తున్నారు ఇంతకాలం. అయితే డిఎస్పీ ఇందిర ఈ పేకాట కేంద్రాలపై పూర్తి సమాచారం తెలుసుకొని కావలి పట్టణం గాయత్రినగర్ నలందవీధిలో నిర్వహిస్తున్న పేకాట కేంద్రంపై దాడి చేశారు. ఈ దాడిలో పేకాట ఆడుతుండిన జలదంకి మండల ఆర్ఐ రామిరెడ్డితోపాటు పదిమందిని అరెస్టు చేశారు. దీనిపై ఆమెకు నేతల నుంచి పలు ఒత్తిళ్లు వచ్చినా పట్టించుకోక ఉన్నతాధికారులకు సమాచారం అందించారు. కావలి మేజిస్ట్రేట్ సెలవుపై వుండడంతో పేకాట రాయుళ్లను నెల్లూరు కోర్టులో హాజరుపరిచారు. పోలీసు చర్యలపై రెవెన్యూ అధికారులు, అధికారపార్టీ నేతలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. ఇదిలా వుంటే, పోలీసులు పేకాట స్థావరంపై దాడి చేసి 10లక్షలు పట్టుకొని 4లక్షలే చూపారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. దీనికి పోలీసులు ఏమి సమాధానం చెప్తారో!

# ఆరోగ్య కేంద్రాల నిధుల్లో గోల్మాల్!

ఉదయగిరి నియోజకవర్గంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలకు ప్రభుత్వం అందించిన నిర్వాహక నిధులు ప్రక్కదారి పట్టడంపై గగ్గోలు రేగుతుంది. ప్రాథమిక కేంద్రాలలో మౌలిక వసతుల కల్పన, ఇతరత్రా అవసరాల నిమిత్తం ఒక్కో కేంద్రానికి లక్షా 75వేల రూపాయలు మంజూరు చేసింది. వీటిని ఒక్క ఏడాదిలోపే ఖర్చు చేయాల్సి వుంటుంది. ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోని ఎనిమిది మండలాల్లో 11 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు న్నాయి. వీటిలో అధికభాగం కేంద్రాలలో నిధులు స్వాహా అయ్యాయనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. కొందరు వైద్యాధికారులు, కమిటీ మెంబర్లు కుమ్మక్కై ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలకు రాష్ట్రప్రభుత్వం మంజూరు చేసిన నిధులను ప్రక్కదారి పట్టించినట్లు సమాచారం. ఇటీవల కలువాయి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో అక్కడ పనిచేసే వైద్యాధికారి లక్షల రూపాయల నిధులు స్వాహా చేయడం గగ్గోలు రేపింది. అతనిపై చర్యలకు అధికారులు సిఫార్సు చేసినా ఆ వైద్యుడు లెక్కలేనితనంగా ప్రవర్తిస్తున్నాడు. ఇలాంటి సమయంలో జిల్లాలోని ఉదయగిరి నియోజకవర్గంలో అలాంటి స్వాహాపర్వం జరిగాయన్న ఆరోపణలు వస్తుండడం ఆరోగ్య కేంద్రాలలో జరుగుతున్న అవినీతిని తేటతెల్లం చేస్తున్నాయి. దీనిపై సమగ్ర విచారణ జరిపితే అవినీతిపరులైన వైద్యసిబ్బంది బయటపడతారు.

### అవినీతి కూపాలుగా ఉదయగిరి పిహెచ్‌సిలు

# మారని గిరిజన బతుకులు

● ముత్తుకూరులో ఇదీ పరిస్థితి

పారిశ్రామికంగా ముత్తుకూరు మండలం ఎంతో అభివృద్ధి చెందుతున్నా గిరిజన కుటుంబాల పరిస్థితి మాత్రం నానాటికి దిగజారిపోతోంది. నేటికి గిరిజనులు బురదలోనే బతుకు పోరాటం సాగించాల్సిన పరిస్థితులు నెలకొంటున్నాయి. తీరప్రాంతంలో ఓడరేవు, విద్యుత్ ప్రాజెక్టులు, పరిశ్రమలు ఏర్పాటయ్యాయి. ప్రభుత్వం కోట్ల రూపాయలను పరిహారం నిమిత్తం అందజేసినా గిరిజనుల జీవితాలు మాత్రం బాగుపడలేదు. థర్మల్ విద్యుత్ కేంద్రం, పోర్టు ఏర్పాటుతో వ్యవసాయభూములు అదృశ్యం కావడం, ఉప్పుకాలువలు మూసుకపోవడంతో పెద్దసంఖ్యలో గిరిజనులు ఉపాధికోల్పోయారు. ఆయా ప్రాంతాల్లోని గిరిజనులకు ఉపాధి కల్పించేందుకు, వారిని ఆదుకొనేందుకు ఐటిడిఏ గ్రామసభలు నిర్వహించి, వివిధ సర్వేలు జరిపింది. 145మంది గిరిజనులను ఎంపికచేసి సైకిళ్లు, చెక్క రిక్షాలు, గేదెలు, వలలు పంపిణీ చేశారు. ప్రభుత్వం కేటాయించిన నిధులు అరకొరగా వుండడం, తక్కువ మందికి మాత్రమే ప్రభుత్వం నుంచి సహాయం అందడంతో వందలాది గిరిజన కుటుంబాల పరిస్థితి దయనీయంగా వుంది. బురదగుంటల్లో చేపలు పట్టుకొంటూ పూరిపాకల్లోనే నివసిస్తున్నారు. అధికారులు తమపై దృష్టి సారించి నివాస గృహాలు మంజూరు చేయడంతోపాటు ఉపాధి అవకాశాలను మెండుగా కల్పించాలని మండలంలోని పలువురు గిరిజనులు కోరుకొంటున్నారు.

● బోగోలులో

# జగజ్జీవన్‌రామ్ జయంతి!



జగజ్జీవన్ రామ్‌కు నివాళులర్పిస్తున్న సేవాదళ్ నేతలు.

డాక్టర్ బిఆర్ అంబేద్కర్ సేవాదళ్ ఆధ్వర్యంలో బోగోలులో ఏప్రెల్ 6న బాబు జగజ్జీవన్‌రామ్ జయంతిని ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా వక్తలు మాట్లాడుతూ జగజ్జీవన్‌రామ్ దళితుల అభ్యున్నతికి చేసిన సేవలను కొనియాడారు. దళితులందరూ ఎలాంటి అరమరికలు లేకుండా ఐక్యంగా వుంటూ అంబేద్కర్, జగజ్జీవన్‌రామ్ చూపిన బాటలో నడవాలని పిలుపునిచ్చారు. జగజ్జీవన్‌రామ్ జయంతిని పురస్కరించుకొని కేక్ కట్‌చేసి అందరికి పంచిపెట్టారు. అంబేద్కర్ సేవాదళ్ అధ్యక్షుడు శ్యామ్ సుధాకర్ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో మాజీ ఎంపిటిసి సభ్యుడు రామయ్య, మాజీ సర్పంచ్ రామకృష్ణ, మాధవరావు, డాక్టర్ చంద్రశేఖర్, బుద్దయ్య, డాక్టర్ విజయేంద్ర పలువురు బిసి, ఎమ్మార్పిఎస్ నాయకులు పాల్గొన్నారు.

● వెంకటగిరిలో

# నిరసనల వెల్లువ!

పెంచిన విద్యుత్ ఛార్జీలను తక్షణం తగ్గించాలని డిమాండ్ చేస్తూ వివిధ పార్టీలు నిర్వహించిన నిరసనలు, చేపట్టిన ఆందోళనలతో వెంకటగిరి దద్దరిల్లిపోయింది. విద్యుత్ ఛార్జీలు పెంచడం, సర్‌ఛార్జీల పేరుతో అదనపు భారం మోపుతుండడంపై వామపక్షాలు, తెలుగుదేశం, వైకాపాలు వేరువేరుగా నిరసన కార్యక్రమాలు చేపట్టాయి. తహశీల్దార్ కార్యాలయం ఎదుట తెలుగుదేశంపార్టీ నిరాహారదీక్ష చేపట్టింది. టిడిపి జిల్లా ఉపాధ్యక్షుడు చెలికం శంకర్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ దీక్షల్లో స్థానిక శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ, జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్రలు పాల్గొని ప్రభుత్వ తీరును ఎండగట్టారు. వైకాపా ఇదే సమస్యపై విద్యుత్ సబ్‌స్టేషన్ ఎదుట ధర్నా నిర్వహించింది. ఈ ధర్నాకు నియోజకవర్గ వైకాపా ఇన్‌ఛార్జి కొమ్మి హాజరవుతారని అనుకొన్నా చివరి నిమిషంలో ఆయన పాల్గొనకపోవడం కార్యకర్తలలో కొంత నిరుత్సాహాన్ని కల్గించింది. బాలాయపల్లి, వెంకటగిరి మండల కన్వీనర్లు శింగంశెట్టి భాస్కర్, వీరారెడ్డి సారథ్యం వహించారు. వామపక్షాలు తహశీల్దార్ కార్యాలయం ఎదుట నిరసన కార్యక్రమాన్ని చేపట్టాయి. సిపిఎం కార్యదర్శి వడ్డేపల్లి చెంగయ్య, రైతుకూలీ సంఘం నేత వివి రమణయ్య తదితరులు దీనిలో పాల్గొన్నారు.

# బిట్రగుంటకు పూర్వ వైభవం తెస్తా!



మాట్లాడుతున్న కేంద్ర రైల్వే మంత్రి కోట్ల సూర్యప్రకాష్‌రెడ్డి.

రైల్వేపరంగా బిట్రగుంటకు పూర్వవైభవం తీసుకొని వచ్చేందుకు కృషిచేస్తానని రైల్వేశాఖ సహాయ మంత్రి కోట్ల సూర్యప్రకాష్ రెడ్డి హామీ ఇచ్చారు. ఏప్రెల్ 6వతేది బిట్రగుంట వచ్చిన ఆయన అక్కడ జరిగిన సభలో ప్రసంగించారు. వందల కోట్ల రైల్వే ఆస్తులున్న బిట్రగుంట మౌలిక సదుపాయాలకు నోచుకోక నిరుపయోగంగా మారడం బాధాకరమన్నారు. రైల్వే మంత్రి బన్సాల్, రైల్వేబోర్డుతో చర్చించి వున్న ఆస్తులను సద్వినియోగం చేసుకొని ఈ ప్రాంత ప్రజలకు ఉపయోగపడేలా తగిన చర్యలు చేపడుతామన్నారు. నెల్లూరు వరకు నడిచే మెమోరైళ్లను బిట్రగుంట వరకు పొడిగించేందుకు, నిర్వహణ షెడ్లను ఏర్పాటు చేసేందుకు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. పనిలోపనిగా వైఎస్ జగన్‌పైన విమర్శలు చేశారు. తన తండ్రి కోట్ల విజయభాస్కర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా పని చేసినా ఆయన కొడుకుగా గౌరవాన్ని పెంచామేగాని ఆస్తులు పెంచుకోలేదన్నారు. జగన్ తన తండ్రిని అడ్డుపెట్టుకొని కోట్లు సంపాదించి చెడ్డపేరు తెచ్చుకొన్నారని, అలాంటి వ్యక్తి ఏర్పాటు చేసిన పార్టీకి చరిత్ర వుండబోదన్నారు. వైకాపాలోకి వెళితే భవిష్యత్ చీకటి అవుతుందని, దీనిని దృష్టిలో వుంచుకొని ఆ పార్టీలోకి వెళ్లిన వాళ్లు ఆలోచించుకోవాలన్నారు. కావలి వస్త్ర వ్యాపారులు పలు రైళ్లను కావలిలో నిలుపు చేయాలంటూ మంత్రికి వినతిపత్రం సమర్పించారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, సుధీర్‌బాబు, మదనగోపాల్, బొద్దు మురళీ మోహన్‌రెడ్డి, అమరా సుబ్బారావు, మాల్యాద్రి, వాసు, నాగేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

# పన్ను వసూళ్లు చేయండి!

వెంకటగిరి పురపాలక సంఘపరిధిలో ఆస్తిపన్ను వసూళ్లపై అధికారులు ప్రత్యేకదృష్టి సారించాలని మున్సిపల్‌శాఖ అదనపు డైరెక్టర్ యాదగిరిరెడ్డి సూచించారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆయన మున్సిపల్ కార్యాలయంలో అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించారు. ప్రజలకు మౌలిక వసతులు కల్పించడంతోపాటు పన్ను వసూళ్లపైనా శ్రద్ధ పెట్టాలన్నారు. ఈ ఏడాది రాష్ట్రంలో 910 కోట్ల రూపాయలు ఆస్తిపన్ను వసూలు చేయాలని లక్ష్యంగా పెట్టుకొన్నామని, ఇప్పటివరకు 800 కోట్ల రూపాయలు వసూలయ్యాయన్నారు. వచ్చే ఏడాది ఈ లక్ష్యాన్ని 1200 కోట్ల రూపాయలుగా నిర్ణయించుకొన్నట్లు తెలిపారు. ఈ సంవత్సరం రాష్ట్రంలో కొత్తగా 58 మున్సిపాలిటీలు ఏర్పాటు చేయాలన్న నిర్ణయం ప్రతిపాదన దశలో వుందన్నారు. గతంలో వెంకటగిరి మున్సిపాల్టీలో బిల్లు కలెక్టర్‌గా పనిచేసిన వ్యక్తి 15 లక్షలరూపాయలు దుర్వినియోగం చేశారని వచ్చిన ఫిర్యాదులపైనా అదనపు డైరెక్టర్ విచారణ జరిపారు.





అల్లూరు గ్రామంలో 60 లక్షలు వెచ్చించి స్మశాన వాటికను నిర్మించిన బెంగుళూరు ఆర్ఆర్ హోటళ్ల అధినేత కరవళ్ల వెంకటరమణారెడ్డిని సన్మానిస్తున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ బి.వి.రమణకుమార్.

# కాంగ్రెస్ ప్రభుత్వాన్ని సాగనంపండి!



బీద రవిచంద్ర సలహా.

ప్రజలపై పన్నుల భారం పెంచుతూ రాక్షసపాలన సాగిస్తున్న కిరణ్ కుమార్‌రెడ్డి సర్కార్‌ను సాగనంపాలని తెలుగుదేశంపార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర పిలుపునిచ్చారు. విద్యుత్ ఛార్జీల పెంపు, అదనపు ఛార్జీల పేరుతో సామాన్యులపై భారం మోపడాన్ని నిరసిస్తూ కావలి పట్టణంలో తెలుగుదేశంపార్టీ ఆధ్వర్యంలో రిలే దీక్షలు చేపట్టారు. పట్టణ టిడిపి అధ్యక్షుడు మలిశెట్టి వెంకటేశ్వర్లు ఆధ్వర్యంలో జరిగిన ఈ దీక్షా శిబిరానికి విచ్చేసిన రవిచంద్ర కాంగ్రెస్ ప్రభుత్వ తీరుపై విరుచుకుపడ్డారు. సర్దుబాటు ఛార్జీలు, సర్‌ఛార్జీల పేరుతో అదనపు భారం మోపిన ప్రభుత్వం అవి చాలవన్నట్లు విద్యుత్ ఛార్జీలు పెంచడం దారుణమన్నారు. దీని వలన ప్రజలపై ఏడాదికి 200కోట్లకు పైగా భారం పడుతున్నాదన్నారు. ఇంతగా ప్రజల జీవితాలను చిన్నాభిన్నం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వానికి ప్రజలు వచ్చే ఎన్నికలలో తగిన బుద్ధి చెప్పాలని పిలుపునిచ్చారు. ఛార్జీలు తగ్గించేవరకు ఉద్యమాన్ని ఉధృతం చేస్తామని హెచ్చరించారు. ఈ కార్యక్రమంలో టిడిపి ప్రధానకార్యదర్శి గాదంశెట్టి వేణుగోపాల్, మాల్యాద్రి, రవి, అశోక్, ప్రసాద్, శ్రీహరి, ఆత్మకూరి బ్రహ్మయ్య, తటపర్తి వాసు, ఖలీల్ తదితరులు పాల్గొన్నారు.

# బుచ్చి కోదండరాముని బ్రహ్మోత్సవాలు!

బుచ్చిరెడ్డిపాళెంలో వెలసి వున్న సీతాలక్ష్మణ సమేత కోదండరామస్వామి బ్రహ్మోత్సవాలు ఏప్రెల్ 18 నుంచి 28 వరకు జరగనున్నాయి. 18వతేదీ అంకురార్పణతో ఆరంభమయ్యే ఈ ఉత్సవాలు 19న శేష వాహనం, 20న సూర్యప్రభ, హంస వాహనం, 21న వ్యాళి వాహనం, 22న హనుమంతసేవ, 23న మోహిని అవతారం, గరుడ సేవ, 24వతేది కళ్యాణోత్సవం, గజవాహనం, 25న రథోత్సవం, తెప్పోత్సవం, 26న అశ్వవాహనం, 27వతేదీ చక్రస్నానం జరుగుతుందని, 28న జరిగే ఏకాంత సేవతో ఉత్సవాలు ముగుస్తాయని ఆలయ వ్యవస్థాపక ధర్మకర్త దొడ్ల మురళీకృష్ణారెడ్డి తెలిపారు.

## 25న రథోత్సవం

ఈ ఉత్సవాలలో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నామని, భక్తులు అధికసంఖ్యలో విచ్చేసి శ్రీరామ దర్శనం చేసుకోవాలని కోరుతున్నారు.

# కావలిలో కొత్త విద్యుత్ సబ్‌స్టేషన్లు!

## రూ. 5 కోట్లు మంజూరు.

కావలి నియోజకవర్గంలోని వివిధ మండలాల్లో ఐదుకోట్ల రూపాయలతో సబ్‌స్టేషన్లు ఏర్పాటు చేస్తున్నట్లు స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు తెలిపారు. కావలిలో జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ నియోజకవర్గ పరిధిలోని కావలి, అల్లూరు, బోగోలు, దగదర్తి మండలాల్లో ఈ విద్యుత్ సబ్‌స్టేషన్లు మంజూరయ్యాయన్నారు. గోగులపల్లి, నార్తుమోపూరు, తుమ్మలపెంట, జక్కేపల్లి గూడూరు, దామవరంలో ఈ సబ్‌స్టేషన్లు ఏర్పాటు కానున్నాయన్నారు. ఐదు కోట్ల రూపాయలతో నిర్మితమయ్యే ఈ సబ్‌స్టేషన్ల వలన గ్రామాలలో విద్యుత్ సమస్యలను అధిగమించే అవకాశం వుందన్నారు. ఓల్టేజ్‌లో హెచ్చుతగ్గులు తదితర సమస్యలు లేకుండాపోతాయన్నారు.

# నత్తనడకన భవన నిర్మాణాలు!

ముత్తుకూరు మండలంలో పంచాయితీరాజ్‌శాఖ ద్వారా మంజూరైన పనులు నత్తనడకన సాగుతున్నాయి. దీంతో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని అన్న చందంగా వుంది పరిస్థితి. మండలంలోని వల్లూరు, పాటూరువారి కండ్రిగ, పోలంరాజుగుంట, నేలటూరు, తాళ్లపూడిలలో పంచాయితీ కార్యాలయాలకు నూతన భవనాలు నిర్మించేందుకు 2011వ సంవత్సరంలో నిధులు మంజూరయ్యాయి. ఒక్కో

## పంచాయితీ కార్యాలయాలు ఎప్పట్లో పూర్తయ్యేనో?

భవనానికి 10 లక్షల రూపాయలు మంజూరు చేసినప్పటికి నిర్మాణ పనులు నేటికి పూర్తికాలేదు. అతికష్టం మీద నేలటూరు, తాళ్లపూడిలో మాత్రం భవన నిర్మాణాలు పూర్తి చేయగా, పోలంరాజుగుంటలో నిర్మాణ పనులు అసంపూర్తిగా నిలిచిపోయాయి. పాటూరివారి కండ్రిగ, వల్లూరు గ్రామాల్లో ఇప్పటివరకు భవన నిర్మాణ పనులు ప్రారంభమేకాలేదు. ఈ భవన నిర్మాణాలు చేపట్టేందుకు సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి వేసిన శిలాఫలకాలు దిష్టిబొమ్మల్లా దర్శనమిస్తున్నాయి. అలాగే మండలంలోని వివిధ ప్రాంతాల్లో నిర్మించదలచిన సిమెంటురోడ్డు పనులు ఇంకా ప్రారంభం కాలేదు. స్త్రీశక్తి భవన నిర్మాణ పనులూ పూర్తికాలేదు. దీంతో నిధులు వున్నా పనులు కాకపోవడంతో మండల ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

# వెంకటగిరిలో తొమ్మిది పంచాయితీల విలీనం!

వెంకటగిరి మునిసిపాల్టీలోకి మరో తొమ్మిది పంచాయితీలు రానున్నాయి. మండల పరిధిలో గల 20 పంచాయితీలలో తొమ్మిదింటిని మున్సిపాల్టీలోకి విలీనం చేయడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. ఈ విలీనంపై అభిప్రాయాలు, అభ్యంతరాలు, సలహాలు తీసుకొనే పనిలో పడింది. ఈ కార్యక్రమాన్ని వారంరోజుల్లో పూర్తి చేయాలని నిబంధన విధించింది. ప్రభుత్వ నిర్ణయం మేరకు లాలాపేట, చింతగుంట, జంగాలపల్లి, పెట్లూరు, వల్లివేడు, కలపాడు, మొగళ్లగుంట, చెలికంపాడు, కూర్జాగుంట పంచాయితీలు మునిపాల్టీలో కలవనున్నాయి.

# గ్రామాల్లో ఎన్నికల సందడి!

## పంచాయితీ ఎన్నికలు మరి!

పంచాయితీలలో రాజకీయ సందడి నెలకొంది. స్థానిక సంస్థల ఎన్నికలకు నగరా మ్రోగడంతో గ్రామాలలో ఎన్నికల వాతావరణం ఏర్పడింది. ఈ దఫా పంచాయితీలలో మహిళలకు 50శాతం రిజర్వేషన్లు అమలవుతుండడంతో మహిళల ప్రాధాన్యత పెరగనుంది. సర్పంచ్‌లుగా, పార్టీ మెంబర్లుగా అధికంగా ఎంపిక కానున్నారు. ఇప్పటివరకు సాగిన ప్రత్యేకాధికారుల పాలన ముగియనుంది. ప్రజాప్రతినిధులుగా మూడేళ్ల విరామం అనంతరం పగ్గాలు చేపట్టే అవకాశం ఈ ఎన్నికల ప్రకటనలతో ఏర్పడింది. పంచాయితీ ఎన్నికల సందర్భంగా మార్పులు, చేర్పులు జరిగి ప్రతి ఓటుకు విలువ పెరగనుంది. 2011 జనాభా లెక్కల ప్రకారం మహిళా రిజర్వేషన్లు వుండనున్నాయి. జిల్లాలో ఎస్సీల నిష్పత్తి 6.59శాతం, ఎస్టీల నిష్పత్తి 2.74 శాతంగా రిజర్వేషన్లు అమలు కానున్నాయి. 961 గ్రామ పంచాయితీలో పది పంచాయితీలకు ఆలస్యంగా ఎన్నికలు జరగడంతో ఈసారి వాటికి ఇంకా సమయం వుంది. మిగతా 951 పంచాయితీలకు ఎన్నికలు జరిపించేందుకు అధికారులు అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ పంచాయితీలకు సర్పంచ్‌లుగా రిజర్వేషన్ ప్రకారం 470 మందికి పైగా మహిళలు సర్పంచ్‌లుగా ఎన్నిక కానున్నారు. జిల్లాలో 29.66 లక్షల జనాభాలో మహిళలు 14.73 మంది కాగా, 14.93 లక్షల మంది. ఈ ఎన్నికలకు కోర్టు అనుమతివ్వడం, ప్రభుత్వం ప్రకటన చేయడంతో ఎంతో కాలంగా ఎలాంటి రాజకీయ పదవులు లేక రాజకీయ నిరుద్యోగులుగా వున్న వారికి కాసింత ఊరట లభించనుంది.



# బుచ్చి కళాసాగర్ నాటకోత్సవాలు!

## 18తేది ప్రారంభం

కళాసాగర్ పేరిట గత 28ఏళ్లుగా క్రమం తప్పకుండా బుచ్చిలో నాటకోత్సవాలు నిర్వహిస్తున్న విషయం తెలిసిందే. వివిధ నాటక పరిషత్‌ల నుంచి ఎంపిక చేసిన నాటకాలను ఈ సందర్భంగా ప్రదర్శించడం ఆనవాయితీ. ఈ క్రమంలోనే ఏప్రెల్ 18నుంచి 21వతేదీ వరకు జరిగే ఈ నాటకోత్సవాలలో మొత్తం తొమ్మిదింటిని ప్రదర్శించనున్నట్లు కళాసాగర్ అధ్యక్షుడు దొడ్ల రమణయ్య యాదవ్ తెలిపారు. మొదటిరోజు కాకినాడకు చెందిన శ్రీమూర్తికల్చరల్ అసోసియేషన్ వారి 'సంచలనం' నాటిక, హైదరాబాద్ ఉషోదయ కళానికేతన్ వారిచే 'ఆఖరి ఉత్తరం' ప్రదర్శిస్తారన్నారు. రెండవరోజు పెదకాకాని వారితో 'గమనం', కాకినాడ సాయి కార్తిక్ క్రియేషన్స్ వారి 'దూరాలే కాదు', కొప్పోలు పండు క్రియేషన్స్ వారి 'పుష్కరిణి' ప్రదర్శితమవుతాయన్నారు. అలాగే 20వ తేదిన విశాఖపట్నం చైతన్య కళా స్రవంతి వారి 'సీతాకోకచిలుక', తాడేపల్లి అరవింద ఆర్ట్స్‌వారి 'దయచేసి తలుపులు తెరవండి' పిఠాపురం మణికంఠ ఆర్ట్స్ 'ఆచంద్రార్కం', 21న కొలకలూరు శ్రీసాయి ఆర్ట్స్ వారి 'ఒక్కమాటచాలు' నాటకం ప్రదర్శింపబడతాయన్నారు. ఈ రాష్ట్రస్థాయి నాటకోత్సవాలను జిల్లా తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శి ఎర్రంరెడ్డి గోవర్ధన్‌రెడ్డి ప్రారంభిస్తారని, బహుమతి ప్రదానోత్సవానికి కోవూరు శాసనసభ్యుడు ప్రసన్నకుమార్‌రెడ్డి ప్రత్యేక ఆహ్వానితునిగా విచ్చేస్తారని రమణయ్య తెలిపారు. ఈ నాటకోత్సవాలకు కళాప్రియులు, నాటక ప్రియులు విచ్చేసి విజయవంతం చేయాలని కోరుతున్నారు.

● 30 పడకల ప్రభుత్వాస్పత్రుల్లో

# భోజన సదుపాయం!

**డిఎంఅండ్‌హెచ్‌ఓ వెల్లడి**

జిల్లాలో గల ముప్పైపడకల ప్రభుత్వ వైద్యశాలల్లోనూ రోగులకు భోజన వసతి కల్పించారు. ఆస్పత్రిలోని రోగులకు ఉదయం అల్పాహారం, మధ్యాహ్నం, రాత్రి వేళల్లో భోజనం అందించాలన్నారు. ఈ విషయాన్ని జిల్లా వైద్యఆరోగ్యశాఖాధికారి డాక్టర్ మాసిలామణి తెలియజేశారు. ఇటీవల వాకాడు ప్రభుత్వ వైద్యశాలను తనిఖీ చేసిన ఆయన వివరాలు తెలిపారు. వైద్యశాలలో అన్ని విభాగాలను పరిశీలించిన డిఎం హెచ్‌ఓ డాక్టర్లు, సిబ్బందినుద్దేశించి సుతిమెత్తగా మందలించారు. డాక్టర్లపై నమ్మకంతో ప్రభుత్వ ఆస్పత్రులకు వచ్చే రోగులకు తగిన వైద్య సహాయం అందించాలన్నారు. అప్పుడే ప్రజలకు నమ్మకం కల్గుతుందని తెలిపారు. విది నిర్వహణలో అలసత్వం వహిస్తే ఉపేక్షించేది లేదని, శాఖాపరంగా కఠిన చర్యలు తీసుకొంటామన్నారు. వైద్యశాల సిబ్బంది పనితీరుపై ప్రజల నుంచి అనేక ఫిర్యాదులు అందుతున్న విషయాన్ని ప్రస్తావించిన ఆయన అధికారులకు తీవ్ర హెచ్చరికలు జారీ చేశారు. అలాగే అంబులెన్స్ డ్రైవర్ సక్రమంగా విధులకు రాకపోవడాన్ని గుర్తించిన డాక్టర్ మాశిలామణి అతనికి మెమో ఇవ్వాలని క్లస్టర్ వైద్యాధికారిని ఆదేశించారు.

## సమస్యాత్మక గ్రామాల గుర్తింపు!

**వెంకటగిరి మండలంపై ప్రత్యేక దృష్టి**

రానున్న పంచాయితీ ఎన్నికలను దృష్టిలో వుంచుకొని అధికారులు సమస్యాత్మక గ్రామాలపై దృష్టిసారిస్తున్నారు. ఆయా గ్రామాలను గుర్తించడంతోపాటు ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా వుండేలా అన్ని చర్యలు చేపడుతున్నారు. వెంకటగిరి మండల పరిధిలో గల 15 సమస్యాత్మక గ్రామాలను తహశీల్దార్ కృష్ణమూర్తి ప్రకటించారు. పంచాయితీ ఎన్నికల నిర్వహణపై ఆయన ఇటీవల అధికారులతో సమావేశం నిర్వహించారు. మండలంలోని చిన్నన్నపేట, యాతలూరు వంటి సమస్యాత్మక గ్రామాల్లో పటిష్టమైన పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయాలని ఎస్ఐ అన్వర్‌బాషాకు సూచించారు. ఓటర్ల జాబితాను, రిజర్వేషన్ల ప్రక్రియను ఉన్నతాధికారులు ఆదేశాల మేరకు నిర్వహిస్తామని తెలిపారు. తహశీల్దార్‌తో పాటు ఎంపిడిఓ శివప్రసాద్ ఎన్నికల నిర్వహణపై సమీక్ష జరిపారు.

## ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణానికి అడ్డంకులు!

**ఆగిన సిమెంటు సరఫరా**

పేదలకు నివాస వసతి కల్పించాలన్న ఉద్దేశంతో ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా రూపొందించిన ఇందిరమ్మ ఇళ్ల పథకం ఉదయగిరి నియోజక వర్గంలో అబందరగా మారింది. అధికారులు లబ్దిదారుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుండడం, సిమెంటు సరఫరా సక్రమంగా చేయకపోవడంతో పేదలకు ఇళ్లు అందకుండాపోతున్నాయి. నియోజకవర్గ పరిధిలోని సీతారాంపురం, ఉదయగిరి, దుత్తలూరు, వరికుంటపాడు, వింజమూరు, కలిగిరి, కొండాపురం, జలదంకి తదితర మండలాల్లో ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణం ముందుకు సాగడం లేదు. ఇళ్ల నిర్మాణానికి అవసరమైన సిమెంటును కొద్దికాలం అధికారులు సరఫరా చేశారు. ఆ తర్వాత సిమెంటు స్థానంలో నగదును లబ్దిదారులకు పంపిణీ చేశారు. తిరిగి కేటాయించిన ప్రకారం సిమెంటు సరఫరా చేస్తున్న అధికారులు దానిని సక్రమంగా చేయక చేతులెత్తేయడంతో ఇళ్ల నిర్మాణాలు మధ్యలోనే నిలచిపోయి లబ్దిదారులు లబోదిబోమంటున్నారు. తమకు రావల్సిన సిమెంటు అందించమని కోరుతూ నియోజకవర్గంలోని వివిధ మండలాల లబ్దిదారులు గృహనిర్మాణశాఖ అధికారుల చుట్టు చెప్పులరిగేలా ప్రదక్షణలు చేస్తున్నా ఫలితం లేకుండాపోతోంది. ఎఇ, డిఇ, వర్క్‌ఇన్స్‌పెక్టర్‌లు ఒకరిపై ఒకరు చెప్పుకొంటూ, సరిగా అందుబాటులో వుండకపోతుండడంతో ఇళ్లు ఎప్పుడు పూర్తవుతాయో తెలియక ఇందిరమ్మ ఇళ్ల లబ్దిదారులు ఆందోళన చెందుతున్నారు.

## ఉదయగిరిలో జోరుగా కాపీయింగ్!

**పట్టించుకొన్నవాడు లేడు.**

ఉదయగిరి నియోజకవర్గ పరిధిలో జరిగిన పదవతరగతి పరీక్షల్లో కాపీయింగ్‌కు అడ్డే లేకుండాపోయింది. ఇష్టానుసారంగా వివిధ సెంటర్లలో పరీక్ష వ్రాసే పదవ తరగతి విద్యార్థులకు దగ్గరుండి సమాధానాలు చెప్పడం, చిట్టాలు అందించడంతో కాపీయింగ్‌కు కేరాఫ్ అడ్రస్‌గా మారాయి. మొదటి నుంచి పరీక్షల్లో కాపీయింగ్‌కు పాల్పడం ఈ ప్రాంతంలో అధికం. అన్ని తెలిసినా అధికారులు చూసీచూడనట్లు వ్యవహరించడం, ప్రైవేట్ పాఠశాలల యాజమాన్యాలతో కొందరు పరీక్షలు సిబ్బంది కుమ్మక్కు కావడంతో విచ్చలవిడిగా కాపీయింగ్ జరిగింది. ముందుగా కరస్పాండెంట్లతో కుదుర్చుకొన్న ఒప్పందం ప్రకారం నగదు అందిన కేంద్రాలవైపు కన్నెత్తి చూడని అధికారులు, అడిగినంత ఇవ్వని పాఠశాలల విద్యార్థులు పరీక్ష వ్రాసే చోట మాత్రం కఠినంగా వ్యవహరించడం విమర్శల పాలయ్యింది.

# శుభప్రదం పంచాంగ శ్రవణం!

ఏ కార్యక్రమం తలపెట్టాలన్నా మంచిరోజు, ముహూర్తం చూడడం చాలామందికి అలవాటు. తిథి, వారం, వర్జ్యం ఇవి చూడకుండా ఏ పని చేయడానికి ఇష్టపడని వారు అధికంగా వుంటారు. నిత్య వ్యవహారాలలో పలువురు ఇలాంటి వాటి కోసం క్యాలెండర్‌పైనే ఆధారపడుతుంటారు. ఇంగ్లీష్ క్యాలెండర్ అయిన గ్రిగేరియన్ క్యాలెండర్‌నే వినియోగిస్తున్నా శుభకార్యాలు, పూజాపునస్కారాలు, పితృదేవతారాధన వంటి విషయాల్లో మాత్రం పంచాంగాన్ని ఆశ్రయిస్తారు. పంచాంగానికి వుండే ప్రాధాన్యత, విశిష్టత అటువంటిది. ఐదు అంగముల కలయిక కాబట్టే దీనికి పంచాంగం అని పేరొచ్చింది. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనేవి ఈ ఐదు అంగాలు. 15 తిథులు, 7వారాలు, 27 నక్షత్రాలు, 27 యోగములు, 11 కరణములు వున్నాయి. వీటన్నింటిని తెలిపేదే పంచాంగం.

ఈ పంచాంగం ఉగాది నుంచి అమలులోకి వచ్చి తిరిగి వచ్చే ఉగాది ముందు రోజు వరకు అమలులో వుంటుంది. అలాంటి పంచాంగాన్ని వివిధ దేవతలతోపాటు పూజించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. పంచాంగ శ్రవణానికి ఉగాదినాడు విశేష ప్రాముఖ్యముంది. ఆనాడు పంచాంగ శ్రవణాన్ని గ్రామాల నుంచి పట్టణాల వరకు నిర్వహిస్తుండడం విశేషం. ఉగాదితో ఆరంభమయ్యే తెలుగు సంవత్సరంలో రాశిఫలాలు, గ్రహస్థితులు ఎలా వున్నాయో తెలుసుకొని సుఖంగా వుండడానికి చేపట్టాల్సిన చర్యలను తెలుసుకొనేందుకు పంచాంగ శ్రవణం చేస్తారు. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ ఫలితాన్ని తెలుసుకోవడం వలన గంగాస్నానం చేసినంత పుణ్యాన్ని పొందుతారని శాస్త్రాలు చెబుతున్నాయి. పూర్వం పంటలు ఎలా పండుతాయి, ఏరువాక ఎలా సాగాలి అనే విషయాల్ని సైతం పంచాగ శ్రవణం ద్వారా తెలుసుకొని దానికి అనుగుణంగా నడచుకొనే వారు రైతులు.

పంచాంగం శ్రవణం చేసేటప్పుడు ఉత్తరాభిముఖంగా కూర్చొంటే మంచిదని పండితుల అభిప్రాయం. ఇందులో ప్రధానంగా ఆ సంవత్సర ఫలితాల్ని వివరిస్తారు. నవనాయకులను తెలుసుకొని వారి ద్వారా సంవత్సర ఫలాలను అంచనా వేస్తారు. సంవత్సరంలో ఏఏ గ్రహాలకు అధికారం లభిస్తుందో తెలుసుకొంటారు. ఈ గ్రహాలే ఆ సంవత్సర నవ నాయకులు. వీరికి లభించే అధికారాన్ని బట్టి ఆ సంవత్సరం ఫలితాలు వుంటాయి. పంచాంగ శ్రవణం ఖగోళ శాస్త్ర దృక్కోణానికి అద్దంపడుతుంది. ఖగోళ స్థితిగతులను అంచనా వేసి రూపొందించేది పంచాంగం. చంద్రుని నడకకు సంబంధించినది తిథి. వారంలోని ప్రతిరోజును ఆ గ్రహానికి అధిదేవతగా భావించి ఆరోజును ఆ గ్రహం పేరుతో పిలుస్తారు. రాశిచక్రంలో 27 నక్షత్రాల్లో ఏ రోజున ఏ నక్షత్రం దగ్గరకు చంద్రుడు వస్తే ఆరోజు ఆ నక్షత్రం వున్నట్లు చెబుతారు. నక్షత్ర రాశిలో సూర్యచంద్రులు వున్నట్లు భావించి యోగం లెక్కకడతారు. తిథిలో అర్ధభాగం కరణం. ఇన్ని విషయాలు ఉన్నాయి కాబట్టి పంచాంగానికి అంతటి ప్రాధాన్యత లభిస్తోంది.

రానురాను వివిధ రాజకీయ పార్టీలు పంచాంగ శ్రవణాన్ని ఏర్పాటు చేయడం, పండితులు ఆయాపార్టీల అధి నాయకులను సంతృప్తి పరచేలా ఫలితాలు చెప్తుండడంతో విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.



సభలు - సమావేశాలు

# జగజ్జీవన్‌రామ్ జయంతి సభలో గందరగోళం!

**ఈ నెల 6తేది కస్తూరిబా కళాక్షేత్రంలో బాబూ జగజ్జీవన్‌రామ్ జయంతిని జిల్లా అధికారులు ఒక ప్రణాళిక ప్రకారం జరపకపోవడంతో సభకు వచ్చిన ప్రజలతోపాటు ప్రజాప్రతినిధులు ఇబ్బంది పడ్డారు.**

నెల్లూరులోని కస్తూర్భాకళాక్షేత్రంలో ఈనెల 6వ తేది నిర్వహించిన జగజ్జీవన్‌రామ్ జయంతి సభలో గందరగోళం నెలకొంది. సభా ప్రారంభం నుంచి వక్తలను వేదికపైకి పిలవడం, సభకు విచ్చేసిన వారికి భోజనాలు ఏర్పాటుచేసే వరకు అనేక లోపాలు బయటపడ్డాయి. సాంఘిక సంక్షేమశాఖ అధ్వర్యంలో జరిగిన ఈ జయంతి వేడుకలకు భారీ సంఖ్యలో ప్రజలు తరలి వచ్చారు. ఇక్కడకు వచ్చిన వారికి సదుపాయాలు కల్పించడంలో అధికారులు పూర్తిగా విఫలం చెందారు. సభ ఉదయం 11 గంటలకు ప్రారంభించిన వెంటనే వేదికపై ఉపన్యసించేందుకు నేతలు పోటీపడ్డారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్, జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, అదనపు జె.సి పెంచలరెడ్డి, సాంఘిక సంక్షేమశాఖ డిప్యూటి డైరెక్టర్ విశ్వమోహన్‌రెడ్డి ఎమార్పీఎస్ నేతలు హాజరయ్యారు.

అధికారులతోపాటు గూడూరు, సూళ్లూరుపేట, నెల్లూరు నగర ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాదరావు, పరసారత్నం, ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డిలు పాల్గొన్నారు. జగజ్జీవన్‌రామ్ గురించి వివరించేందుకు దళిత సంఘాల నేతలలో కొందరిని వేదికపైకి ఆహ్వానించారు అధికారులు. అప్పటికి సమయం మించిపోవడం, వేదికపైన అధిక సంఖ్యలో అధికారులు, ప్రజాప్రతినిధులు ఆశీనులు కావడంతో సభను ప్రారంభించారు. కాని మరికొందరు నేతలను వేదికపైకి పిలవాలని డిమాండ్ రావడంతో ఇబ్బందికర పరిస్థితులు నెలకొన్నాయి. దళిత నాయకులు వ్యవహరించిన తీరుతో అధికారులు కొంత అసహనానికి గురయ్యారు. తొలుత దళిత నాయకులకు మాట్లాడే అవకాశం ఇవ్వడంతో ఎక్కువ సమయం తీసుకోవడం మిగిలిన వారు మాట్లాడే సమయానికి కళాక్షేత్రంలో జనాభా పలచబడిపోయారు. ప్రభుత్వం దళితుల కోసం చేపడుతున్న పథకాలు, అమలు చేస్తున్న అభివృద్ధి గురించి ఒక్కరు కూడా సక్ర మంగా వివరించలేకపోయారు.

ఇటీవల ఎస్సీ, ఎస్టీ విజిలెన్స్, మానిటరింగ్ కమిటీలో ఎంపిక కాబడిన సభ్యులు కొందరు అధికారులు, నేతలను పొగిడేందుకు అధిక ప్రాధాన్యతనిచ్చారు. గ్రామీణప్రాంతాల్లో దళితులు ఎదుర్కొంటున్న వివిధరకాల సమస్యలు, అత్యాచారాలు, దాడుల గురించి సరైన విధంగా స్పందించలేకపోయారు. జగజ్జీవన్‌రామ్ జాతీయ నాయకుడు కావడంతో అన్ని వర్గాలకు చెందిన వారు నివాళులర్పించడం ఆనవాయితీ. అధికార యంత్రాంగం జగజ్జీవన్‌రామ్, అంబేద్కర్ జయంతిలను ఎస్సీలలోని రెండు ఉపకులాలకు మాత్రమే పరిమితం చేస్తున్నారు. భారతదేశం మొత్తం గర్వంగా చెప్పుకునే నేతల జయంతి సభలను అన్ని వర్గాల ప్రజలు నిర్వహించాల్సిన అవసరం వుంది. కులం, మతం పునాదుల మీద ఒక జాతిని నిర్మించలేరని ఎప్పుడో అంబేద్కర్ ప్రకటించిన విషయం ప్రతిఒక్కరూ గుర్తించుకోవాల్సిన అవసరం వుంది.

సాంఘిక సంక్షేమశాఖకు ఇటువంటి కార్యక్రమాల బాధ్యతలను అప్పగించడం వల్ల ఏర్పాట్లు సరైన విధంగా చేయడం లేదు. సభకు వచ్చిన వారికి త్రాగునీరు, భోజన సదుపాయాలు పూర్తిగా కల్పించలేకపోతున్నారు. కార్యక్రమాల నిర్వహణకు లక్షల్లో ఖర్చు చేస్తున్నట్లు లెక్కలు చూపుతూ అరకొరగా భోజనాలు సరఫరా చేస్తున్నారు. మొన్న జరిగిన జగజ్జీవన్‌రామ్ జయంతి సభలో భోజనాల కోసం తొక్కిసలాట జరిగింది. అధికారుల దృష్టికి ఈ విషయం కొందరు తీసుకెళ్లినా ఏం చేయలేమని చేతులెత్తేశారు. ఉపన్యాసాల సమయంలో సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం మాట్లాడే సమయానికి కేవలం 10మంది మాత్రమే కళాక్షేత్రంలో వున్నారు. దీంతో తీవ్ర ఆవేదనకు గురైన ఆయన మైకు తీసుకొని వేదికపైనున్న అధికార్లవైపు తిరిగి మాట్లాడుతానని ప్రకటించారు.



**బాబూ జగజ్జీవన్‌రామ్ జయంతి సందర్భంగా ఆయన చిత్రపటానికి పూలమాల వేసి నివాళులర్పిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్, జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నం తదితరులు.**

దళిత నేతల సభలంటే వివక్షత విడనాడాలని పరోక్షంగా అధికారులను చురకలంటించారు. జిల్లా కలెక్టర్ మాట్లాడే సమయానికి కళాక్షేత్రం ఖాళీ అయ్యింది. ఈనెల 14న నిర్వహించబోయే అంబేద్కర్ జయంతి కార్యక్రమానికి పటిష్టంగా ఏర్పాట్లు చేస్తారో లేదో చూద్దాం!



బంద్‌ను పురస్కరించుకొని నెల్లూరు ఆర్టీసి బస్టాండ్ వద్ద బస్సులను ఆపుతున్న సిపిఎం మాజీ ఎమ్పీ పెనుబల్లి మధు, ఆ పార్టీ జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్.



విద్యుత్ సర్ ఛార్జీ, ఛార్జీల పెంపుదలను నిరసిస్తూ నెల్లూరులో జరిగిన బంద్ సందర్భంగా స్కూటర్ ర్యాలీ చేస్తున్న వైకాపా నేత డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్.



విద్యుత్‌ఛార్జీల పెంపుదలను నిరసిస్తూ కావలిలో జరిగిన బంద్‌ను పర్యవేక్షిస్తున్న వైకాపా నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



న్యూఢిల్లీలోని తెలుగు అకాడమీ ఉగాది పురస్కారాన్ని కేంద్రమంత్రులు కపిల్ సిబాల్, కిల్లి కృపారాణిల సమక్షంలో అందుకొంటున్న నెల్లూరీయుడు, తిరుపతి టీవీ-9 రిపోర్టర్ నందిగం కృష్ణమోహన్.

# కొత్తా దేముడండీ... సరికొత్త దేముడండీ!

## రామదూత స్వామి చేతి మాల కోసం క్యూ కట్టిన వివిఐపిలు



సాధారణ భక్తుల్లో అమర్‌సింగ్, జయప్రద, రాష్ట్ర మంత్రి గీతారెడ్డి.



స్వామి ఆశీర్వాదం తీసుకొంటున్న డిజిపి.

భారతదేశంలో దైవభక్తి డ్రైనేజీ లేకుండా డేంజర్‌గా పారుతున్నదని అర్థ శతాబ్ది క్రితమే చెప్పాడు గుర్రం జాషువ. ఈనాటికీ ఆ మాట ఎంత సత్యమో, రామదూత ఆశ్రమ వైభవాన్ని చూస్తే అర్థమైపోతుంది. మన జిల్లా సరిహద్దులో, ప్రకాశం జిల్లా గుడ్లూరు గ్రామం దగ్గర రామదూత అనే ఒక స్వామీజీ కొంతకాలం క్రితం ప్రత్యక్ష మయ్యాడు. అది జరిగి ఎంతోకాలం కాలేదు. కానీ ఆ ఆశ్రమ ప్రాచుర్యం మాత్రం జిల్లా, రాష్ట్ర ఎల్లలు దాటి ఢిల్లీ వరకు ఎగబ్రాకింది. ఆ స్వామీజీలో ఏ మహత్మ్యాన్ని దర్శించారో తెలియదు కానీ, కేంద్ర మంత్రులు, జాతీయ నాయకులు, రాష్ట్రమంత్రులు, ఉన్నతాధికారులు, న్యాయమూర్తులు దండు కట్టుకొని వచ్చి పోతున్నారు. ఈ వారంలో ఆ స్వామీజీ ఏదో మాలధారణ చేస్తానని చెప్పాడట. ఇంకేముంది – ఆశ్రమం నిండా ముఖ్యాతి ముఖ్యులంతా గుమికూడి పోయారు. ఢిల్లీ నేత అమర్‌సింగ్, ఆయన్ను ఎప్పుడూ వెన్నంటి వుండే సినీనటి జయప్రద, రాష్ట్ర డిజిపి దినేష్‌రెడ్డి, రాష్ట్ర ఉప ముఖ్య మంత్రి దామోదర రాజనర్సింహ, కేంద్ర మంత్రి కోట్ల సూర్యప్రకాష్‌రెడ్డి, రాష్ట్ర మంత్రులు గీతారెడ్డి, రామిరెడ్డి వెంకట రెడ్డి, ఎమ్పీలు తిక్కవరపు సుబ్బరామరెడ్డి, రాయపాటి సాంబశివరావు, మాజీ పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్, మాజీ ఎమ్పీ మాగుంట పార్వతమ్మ, చిత్తూరు, ప్రకాశం జిల్లాల జడ్జీలు, ఐపిఎస్ అధికారులతో ఆశ్రమం కోలాహలంగా కన్పించింది. కొందరు విఐపిలు భక్తి పారవశ్యంతో పూనకం వచ్చి నేరుగా స్వామీజీ పాదాల చెంత వాలిపోయారు. ఆయన చిద్విలాసం చేస్తూ ఆశీర్వచనం ప్రసాదించాడు.

కొత్తా దేముడండీ.... అన్న పాట గుర్తుకు వచ్చింది ఆ దృశ్యాలు చూస్తే. పుట్టపర్తి సత్యసాయి బాబా మరణం తర్వాత రామదూత వంటి స్వామీజీలు బాబా భక్తులను ఆకర్షించడానికి రకరకాల మార్కెటింగ్ ప్రక్రియలు అవలంభిస్తున్నారు. టక్కు టమార విద్యలు ప్రదర్శిస్తున్నారు. అందుకు ఇదొక చిన్న ఉదాహరణ. ఎవరి మూఢభక్తి, ఎవరి చాందసం వారి స్వంతం. కాదనడానికి మనమెవరం.

# డాక్టర్ పెంచలయ్యకు బెస్ట్ డాక్టర్ అవార్డు!



నెల్లూరులో ఎముకల వైద్యం చేయడంలో మంచి పేరు సంపాదించుకొన్న ప్రభుత్వ వైద్యుడు డాక్టర్ ఎ.పెంచలయ్యకు ప్రపంచ ఆరోగ్య దినోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లాలోని వైద్య విధాన పరిషత్ నేతృత్వంలో నడిచే ఆస్పత్రులలోని అందరు డాక్టర్లల్లోనూ ఉత్తమ సేవలు చేసినందుకుగాను రాష్ట్ర ప్రభుత్వం ఉత్తమ వైద్యుని అవార్డును ప్రకటించింది. దీన్ని 7తేది హైదరాబాద్ కోఠిలోని వైద్య సేవల భవనంలో రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మంత్రి డిఎల్.రవీంద్రరెడ్డి చేతుల మీదుగా డాక్టర్ పెంచలయ్య అందుకొన్నారు. ఈ కార్యక్రమంలో ప్రిన్సిపల్ హెల్త్ సెక్రటరీ అజయ్ సహానీ, ఫ్యామిలీ వెల్ఫేర్ కమిషనర్ పూనం మాలకొండయ్య, వైద్య విధాన పరిషత్ శాఖ డైరెక్టర్ డాక్టర్ వెంకట్రావు, ఆరోగ్య శాఖ డైరెక్టర్ డాక్టర్ అరుణకుమారి తదితరులు పాల్గొన్నారు.

డాక్టర్ పెంచలయ్య జిల్లా స్థాయిలో ఇప్పటివరకు లెక్కలేనన్ని అవార్డులందుకొన్నారు. ఈసారి రాష్ట్ర స్థాయిలో అవార్డునందుకొని జిల్లా ప్రతిష్ట పెంచినందుకు ఆయనకు మా అభినందనలు.

# వారఫలాలు

*తేది 13-4-2013 నుండి 19-4-2013 వరకు మేషంలో కుజ, శుక్ర, కేతువులు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; మీనంలో బుధుడు, రవి 13తేది వరకు తదుపరి మేషంలో; మేష, వృషభ, మిథున, కర్కాటకాలలో చంద్రుడు సంచరిస్తారు.*




ఈ రాశి వారికి గతవారం వలె కార్యసిద్ధిలో ఆటంకాలు, మానసిక దౌర్భల్యం వుంటుంది. ఎదుటి వారి దూషణలుంటాయి. కోపోద్రేకాలు అదుపులో వుంచుకోవాలి. సంతాన విషయంలో సమస్యలు మనస్సును బాధిస్తాయి. స్పెక్యులేషన్‌లో దూకుడు తగ్గించాలి. వ్యవహారాలు నడిపేటప్పుడు రాజీమార్గంలో ఒప్పందాలు చేసుకోవడం మంచిది. వృత్తి, వ్యాపారాలలో స్థిరాభిప్రాయాలు అవసరం.




గ్రహాల వ్యతిరేకత వల్ల కీలక అంశాలపై ప్రత్యేక దృష్టి అవసరం. అంచనాలు అధికంగా వేయవద్దు. వృత్తి, వ్యాపారాలలో భాగస్వామ్య ఒప్పందాలు నెరవేరుతాయి. అయితే ఆర్థిక చిక్కులుంటాయి. విద్యార్థులు చదువుకు అనుకూలత సాధిస్తారు. వ్యవసాయ పనులు చురుకుగా సాగుతాయి. కళా, క్రీడాకారులు శ్రమకు తగ్గ ఫలితం రాబోయే రోజులలో సాధిస్తారు. రాజకీయులకు సామరస్య ధోరణి అవసరం.




గతవారం వలె ఈ వారం కూడా అనుకూల, వ్యతిరేకతలు సమానంగా వున్నాయి. మిత్రులతో సంభాషణల వల్ల లబ్ధి, రుణ దాతల నుండి ఒత్తిడి అధికం. అనవసర వివాదాల అంశాలకు తావివ్వవద్దు. వృత్తి, వ్యాపారాలు సామాన్యంగా వున్నా ఆర్థిక వనరులుంటాయి. వ్యవసాయ పనులు సజావుగా సాగుతాయి. కళా, క్రీడాకారులు వృత్తిపరమైన ముఖ్య విషయాలలో రాజీ ప్రయత్నం అవసరం.




మిత్రుల సహకారంతో చేస్తున్న పనులు నెరవేరుతాయి. ఆర్థిక లబ్ధి పొందగలరు. గృహ నిర్మాణ లేదా గృహ మరమ్మత్తులకై ధన వ్యయం. రక్త సంబంధీకుల వల్ల ఏర్పడ్డ సమస్యలకు పరిష్కారం లభ్యం. రుణ బాధల నుండి విముక్తి. విద్యార్థులు ఓర్పుతో విజయాన్ని సాధిస్తారు. వ్యవసాయ, కళా, క్రీడాకారులు తమ పనులకై నూతన ఆలోచనలు చేస్తారు. శక్తికి మించిన కార్యక్రమాలు చేయవద్దు.




నమ్మినవారిలో శత్రువులున్నారని గ్రహించాలి. తలపెట్టిన పనులలో అభివృద్ధి స్వల్పంగా తగ్గుతుంది. నిరుద్యోగుల ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాలలో ప్రతిబంధక సమస్యలు తగ్గి క్రమంగా పుంజుకుంటాయి. విద్యార్థులకు శుభ వార్తలుంటాయి ధైర్యంతో ముందు కెళ్లండి. వ్యవసాయదారులకు శ్రమానంతర ఫలితాలుంటాయి. కళా, క్రీడ, కార్మిక వర్గాల వారికి మంచి మార్పులు వుంటాయి.




పెద్దల అభిప్రాయాలు, ముఖ్యంగా తల్లితండ్రుల నిర్ణయాలు గౌరవించినందున కొన్ని సమస్యలు పరిష్కారమౌతాయి. రాజీ ధోరణిలో ముందుకు పోవడం మేలు. తద్వారా అనవసర తగాదాలు తగ్గుతాయి. చేస్తున్న పనులు వాయిదా పడినా లబ్ధిపొందగలరు. కొన్ని పనులు సాధించాలంటే సెంటిమెంట్‌ను వదులుకోవాలి. తద్వారా ఆర్థికమాంద్యంతగ్గుతుంది. విద్యార్థులు పరీక్షలు సంతృప్తికరంగా వ్రాస్తారు.

## పంచాంగం

13తేది మేష సంక్రమణం, శ్రీమత్స్య జయంతి. అశ్వనీ కార్తె.

14తేది అంబేద్కర్ జయంతి. గణపతి వ్రతం, సౌరవత్సరాది.

15తేది లక్ష్మీ పంచమి, శ్రీ వ్రతం, నాగపంచమి.

16తేది శ్రీ శృంగేరి జగద్గురు భారతీ తీర్థస్వామి వారి వర్ధంతి.

### శుభ ముహూర్తాలు

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### ఏప్రెల్ తిథులు

చైత్ర శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 13 | శని | తదియ | సా | 07.16 గం.ల.వ |
| 14 | ఆది | చవితి | రా | 09.34 గం.ల.వ |
| 15 | సోమ | పంచమి | రా | 12.04 గం.ల.వ |
| 16 | మంగళ | షష్ఠి | రా | 02.36 గం.ల.వ |
| 17 | బుధ | సప్తమి | తె | 04.57 గం.ల.వ |
| 18 | గురు | అష్టమి | | పూర్తిగా |
| 19 | శుక్ర | అష్టమి | ఉ | 06.53 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




గ్రహాల అననుకూలతల వల్ల ముఖ్యమైన పనులను తప్ప మిగతా వాటిని వాయిదా వేయడం మేలు. ఎదుటివారితో సామరస్యంగా వుండండి. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. బంధుమిత్రులతో బేధా భిప్రాయాలుంటాయి. ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి తగ్గుతుంది. వృత్తి, వ్యాపారులు బుద్ధిబలంతో ఆదాయం పెంచుకుంటారు. ఇతరులతో రహస్య ఒప్పందాలు తగ్గించండి.




తలపెట్టిన పనులు ఆలస్యంగానైనా పూర్తవుతాయి. భాగస్వామ్య వ్యాపారంలోని సమస్యలు, లోపాలకు పరిష్కారం లభిస్తుంది. వృత్తి, వ్యాపారాలు క్రమంగా ఆదాయ వృద్ధి పొందుతాయి. బంధుమిత్రుల స్నేహ బంధాన్ని స్వాగతిస్తారు. విద్యార్థులు ఆత్మవిశ్వాసంతో పరీక్షలకు హాజరవ్వాలి. పుకార్లు నమ్మవద్దు. క్రీడ, కళాకారులు, వ్యవసాయదారులకు అన్యుల ద్వారా సహాయం.




చేసే పనులలో ఆటంకాలెదురైనా సమయస్ఫూర్తితో ముందుకు సాగుతారు. సాహసించి నూతన ప్రయత్నాలు చేయవద్దు. ఉద్యోగులు విధి నిర్వహణలో ఆటంకాలు రాకుండా చూసుకోవాలి. శుభకార్య ప్రయత్నాలు సఫలమౌతాయి. వృత్తి, వ్యాపారాలు గతంలో కంటే మేలనిపిస్తాయి. వ్యవసాయదారులు సమయస్ఫూర్తితో లబ్ధిపొందగలరు. కళా, క్రీడాకారులకు ముఖ్య కార్యాలు వాయిదాపడినా కార్యసిద్ధి వుంటుంది.




గతవారంకన్నా ఈ వారం బాగుంటుంది. క్రమంగా ఆశాజనక పరిస్థితులు నెలకొంటాయి. తలపెట్టిన పనులలో ఆర్థికలబ్ధి పొందగలరు. మీ ఆనందాలకు అవధులుండవు. రావలసిన బాకీలు సకాలంలో అందుతాయి. కుటుంబంలో కలతలు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. సంతానంపై శ్రద్ధ చూపిస్తారు. స్పెక్యులేషన్ లాభించదు. రాజకీయులు అనుకూలతలున్నప్పటికీ సంకల్పబలాన్ని పెంచుకోవాలి.




తొందరపడి ఇతరులకు హామీలివ్వవద్దు. ఇంట్లో శుభకార్య యత్నాలకు శ్రీకారం చుడతారు. కోర్టు వ్యవహారాలు మనస్సుకు ఉపశమనాన్ని కల్గిస్తాయి. ప్రతిబంధకంగా వున్న అంశాలను వాయిదా వేయండి. స్పెక్యులేషన్ పర్వాలేదు. విద్యార్థులు తదుపరి విద్యలపై నిర్ణయానికి రావలసి వుంటుంది. ఓర్పుకు ప్రాధాన్యత ఇవ్వండి. వ్యవసాయదారుల పనులు ఆటంకాలు లేకుండా ముందుకు సాగుతాయి.




వృత్తి, వ్యాపారాలలో భాగస్వామ్య నిర్ణయాలు విజయవంతంగా సాగుతాయి. ఉద్యోగుల విధి నిర్వహణలో ఆటంకాలు సమసిపోతాయి. గతంలో ఏర్పడిన సమస్యలకు పరిష్కారాలు అన్వేషిస్తారు. బంధువర్గాలలో మనస్పర్థలు రానీయకండి. స్పెక్యులేషన్ లాభాల కన్నా నష్ట తీవ్రత ఎక్కువ. విద్యార్థులకు కార్యదీక్షా బాధ్యత పెరుగుతుంది. కళా, క్రీడాకారులకు జీవనోపాధిలో స్థిరత్వం ఏర్పడుతుంది.

# పిల్లల బంగరు భవిష్యత్తుకు 'సుదర్శన' యంత్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సూర్యకుమారి — నెల్లూరు*

** పిల్లల అనారోగ్యం వల్ల చదువు పాడవుతుంది. చదువులో కూడా పెద్దగా మార్కులు రావడం లేదు.*

ఈశాన్యం, వాయువ్యం లోపాలు లేకుండా చేసుకుని దేవుడి గదిలో 'సుదర్శన' యంత్రాన్ని ప్రతిష్టించినట్లయితే మీరు చెప్పిన సమస్యలు చాలా వరకూ పరిష్కరింపబడుతాయి. పరిస్థితిని బట్టి మరి కొన్ని యంత్రాలు సిఫార్సు చేయడం జరుగుతుంది.

*ఎం.విజయలక్ష్మి — ప్రొద్దుటూరు*

** గృహంలో ఆర్థిక ఆరోగ్య సమస్యలున్నాయి. పరిష్కారం చెప్పండి?*

వ్యూ ఫోటో, ప్లాను పంపించి మంచి పని చేశారు. ఉత్తర, తూర్పు దోషాల్ని వేరే ఉత్తరంలో రాశాను. ఆవిధంగా సరిచేసుకొని యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*కేతిరెడ్డి శివారెడ్డి — పలమనేరు*

** ఈ మధ్య మా పల్లె జనం వలసలు ప్రారంభించారు.*

ఆర్థిక, సామాజిక కారణాలున్నప్పటికీ నైరుతి, వాయువ్య దోషాలు పల్లెల్ని నిశ్శేషం చేస్తాయి.

*టి.రమణాచారి — సింగరాయకొండ*

** యంత్ర ప్రతిష్ట చేసుకున్నా ఫలితం లేదు.*

అంగట్లో యంత్రం ప్రతిష్టించుకొంటే పరిస్థితి ఇట్లాగే వుంటుంది. యంత్ర నిర్ణయం, లిఖితం, శుద్ధి, బలి, పూజ, అర్చన, అభిషేకం వంటి ప్రక్రియలు జరిగితేనే యంత్రం శక్తివంతమవుతుంది.

*టి.వి.ఆర్ — నెల్లూరు*

** వివాహానికి వధూవరుల విషయంలో ఇరవై ఎనిమిది అంశాల్ని చూడాల్సిందేనా?*

అవసరం లేదు. వేధో, వ్యతిరేక నక్షత్రాన్ని చూస్తే చాలు. ఆపై రాశి ఫలితాల్ని అధ్యయనం చేసి కుటుంబం సంస్కారవంతమైనదా? కాదా? అని కూడా చూడాలి. ఇది చాలా ప్రధానమైన అంశం.

*పి.వసంతమ్మ — నూతలపాడు*

** క్యాలెండర్ చూస్తారు మావారు. పంచాంగం చూడమంటారా?*

కాలెండర్లు ప్రామాణికమైనవి కాదు. పంచాంగం చూడడం మంచిది. అందునా సూర్య సిద్ధాంతాన్ని ఆచరించడం మంచిదని విజ్ఞుల అభిప్రాయం.

*పి.ఊర్మిళానాయుడు — నాయుడుపేట*

** సోమవారం వివాహాల్ని గురించి వాదోపవాదాలున్నాయా?*

కొన్ని పొరపాట్ల వల్ల ఈ విధమైన ప్రచారాలు జరిగాయి. ధర్మసింధు, ముహూర్త ముక్తావళి, జ్యోతిర్విద్యాభరణం వంటి దాదాపు 30 ప్రామాణిక గ్రంథాలు సోమవారం వివాహాన్ని అంగీకరిస్తున్నాయి. కనుక అభ్యంతరం లేదు.

*కె.వి.రంగాచార్యులు — తిరుపతి*

** ఇంటి మధ్య బావి వుండవచ్చునా?*

ఇలాంటి పద్ధతులు పాత రోజుల్లో అన్నదమ్ముల గృహాలకు మధ్య పాటించేవారు. అయినా మధ్యభాగంలో 'జలదోషం' వరుణవేధ కూడదు. నిర్ధారించబడిన యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*డాక్టర్ ఫణికుమార్ జైన్ — బెంగుళూరు*

** వృక్షాలకు వాస్తు శాస్త్రంలో ఎందుకంత ప్రాధాన్యత ఇచ్చారు.*

వృక్షాలను వనదేవతలని, మానవ రక్షకులని బ్రహ్మ సూక్తం చెబుతోంది. ఇంద్రుడు మానవుల మనుగడ అంతాన్ని గూర్చి ప్రశ్నించినప్పుడు విధాత ఇలా అన్నాడట. "ఎప్పటి వరకు వృక్షం మనుగడ వుంటుందో అప్పటి వరకు మాత్రమే మానవుడు జీవిస్తాడు."

*ఆర్.కేశవరావు — రాపూరు*

** అమ్మ ఆరోగ్యం ఈ మధ్య బాగోలేదు. ఏ పూజలు చేయించమంటారు?*

ముందు స్పెషలిస్టుకు చూపించండి. తర్వాత శివాలయంలో క్షీరాభిషేకం చేయండి. రుద్రాక్ష సంప్రోక్షణ జలాన్ని ఆమెకు తీర్థంగా ఇవ్వండి.

*సి.కేదారేశ్వరరావు — గుంటూరు*

** ఇరవై సంవత్సరాల 'పీడన' ఒక్క యంత్రంతో అంతమై పోయింది.*

ఆకస్మిక అనుమాన మరణాలు పిశాచవేధను కలిగిస్తాయి. నేను సూచించిన యంత్రం 'పిశాచి'ని పారద్రోలింది. సంతోషం.

# దిద్దుబాటులో ఓటరు జాబితాలు!

జిల్లాలో గ్రామ పంచాయితీలకు సంబంధించి రూపొందించిన ఓటరు జాబితాల్లో అనేక లోటుపాట్లు చోటు చేసుకొన్నాయి. ఎన్నికల సంఘం ఆదేశాల మేరకు మార్చి 26నాటికి జాబితాలు ప్రకటించాలని ఆదేశించడంతో హడావుడిగా వీటిని తయారు చేయడం జరిగింది. ఓటరు జాబితాలను మండలపరిషత్, గ్రామ పంచాయితీ కార్యాలయాల్లో ప్రకటించారు. జాబితాల్లో పేర్లు సరిచేసుకునేందుకు వీలు కల్పించారు. అయితే పేర్లు లేని వారు కొత్తగా ఓటరు నమోదు కోసం దరఖాస్తు చేసుకోవాల్సి వుంటుందని అధికారులు చెబుతున్నారు. గ్రామ పంచాయితీల వారీగా ఓటరు జాబితా తయారుచేసి నప్పటికి రిజర్వేషన్లు ఖరారు చేయలేదు. ఎన్నికల సంఘం ఆదేశాల మేరకే ఎస్సీ, ఎస్టీ, బిసిల రిజర్వేషన్లు ఖరారయ్యే అవకాశం వుంది. ఇప్పటికే ప్రకటించిన ఓటరు జాబితాను మరోసారి సవరించే పనిలో పడ్డారు.

జిల్లాలో వున్న 940 గ్రామ పంచాయితీలో సంగం పంచాయితీలకు కార్యదర్శులు లేరు. ఇన్‌ఛార్జీల ద్వారానే పాలన సాగిస్తున్నారు. మండల పరిషత్ గ్రామ పంచాయితీలకు పాలకవర్గం లేకపోవడంతో ప్రత్యేక అధికారుల పాలనను మరో ఆరు నెలలపాటు ఇటీవల ప్రభుత్వం పొడిగించింది. దాదాపు 10రోజులపాటు రాత్రింబవళ్లు కష్టపడి తయారుచేసి గ్రామ పంచాయితీ ఓటరు జాబితాల్లో పొరపాట్లు చోటు చేసుకోవడం విశేషం. ఎన్నికల సంఘం ఆదేశాల మేరకు జాబితా ముందుగానే జాబితాను ప్రకటించాల్సి రావడంతో హడావుడి చోటు చేసుకొందని కొందరు కార్యదర్శులు వ్యాఖ్యానిస్తున్నారు. జిల్లాలో ఎస్సీ ఓటర్లు 3,47,875, ఎస్టీ ఓటర్లు 1,43,798 మంది వున్నట్లు జాబితాల్లో చేర్చారు. 2001 జనాభా లెక్కల ప్రకారం జాబితాను తయారు చేశారు.

> గ్రామ పంచాయితీల ఎన్నికలను పురస్కరించుకొని హడావుడిగా రూపొందించిన ఓటరు జాబితాల్లో పలు లోపాలు కన్పిస్తున్నాయి. ఈ వ్యవహారమై ప్రజలు నిలదీస్తుండేసరికి అధికారులు దిగి వచ్చి దిద్దుబాట్లు చేస్తున్నారు

2011 జనాభా లెక్కల ప్రకారం ఎస్సీ, ఎస్టీ ఓటర్లు మరో 3లక్షలు పెరిగే అవకాశం వుంది. ఇదేవిధంగా బిసీలు కూడా పెరుగుతారు. రాష్ట్ర ప్రభుత్వం మే, జూన్ నెలల్లో గ్రామపంచాయితీ, మండల పరిషత్ ఎన్నికలు నిర్వహించనున్నట్లు ప్రకటించడంతో అధికారులు హడావిడి మొదలైంది.

సిబ్బంది కొరత కారణంగా జాబితా రూపొందించడంలో తీవ్రజాప్యం ఏర్పడింది. జిల్లా పంచాయితీ అధికారి పదవీవిరమణ చేయడంతో జడ్పీ సిఇఓ వీరభద్రయ్య ఇన్‌ఛార్జీగా వ్యవహరిస్తున్నారు. జడ్పీ పాలనా వ్యవహారాలు, మంత్రుల అధికారిక సమావేశాలు, కలెక్టర్ నిర్వహించే సమీక్షలకు ఎక్కువ రోజులు హాజరుకావాల్సి వుంటుంది. ఉన్న సమయం వీటికి సరిపోక పోవడంతో గ్రామ పంచాయితీల పరిపాలనపై దృష్టి సారించేందుకు అవకాశం లేకుండా పోతోంది.

అధికారులు తయారుచేసిన ఓటరు జాబితాను అన్ని రాజకీయ పార్టీలకు అందజేసి అభ్యంతరాలను స్వీకరించాల్సి వుంటుంది. గ్రామస్థాయిలో వున్న రాజకీయపార్టీలు మాత్రం జాబితాల్లో ఎస్సీ, ఎస్టీ బిసీల ఓటర్ల పేర్లు కొన్ని గల్లంతయ్యాయని వాటిని తిరిగి చేర్చాలని డిమాండ్ చేస్తున్నాయి. గతంలో ఓటును నమోదు చేసిన పోలింగ్ కేంద్రం స్థాయి అధికారులకు సరైన అవగాహన లేకుండా పోవడంతో సర్వే కార్యక్రమం సక్రమంగా నిర్వహించలేకపోయారు. ఓటర్ల నమోదు, జాబితాల ప్రకటనకు కొంత సమయమే ప్రభుత్వం ఇవ్వడంతో జిల్లాలో ఈ వ్యవహారం గందరగోళంగా తయారయ్యింది. జిల్లా పంచాయితీ అధికారి లేకపోవడం కూడా జాబితాలు అస్తవ్యస్తంగా తయారవ్వడానికి కారణమయ్యాయి. మొత్తం మీద గ్రామ పంచాయితీల ఓటరు జాబితా గందరగోళానికి దారి తీయడంతో సరిదిద్దే కార్యక్రమం ఎప్పటికీ పూర్తి చేస్తారో వేచి చూడాలి. 

**వైద్య ఆరోగ్య శాఖకు సుస్తీ**

# పిహెచ్‌సిలకు మందుల పంపిణీలో మతలబు!

> **జిల్లాలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు ప్రతి మూడు నెలలకోసారి ప్రభుత్వ నిబంధనల ప్రకారం వైద్య ఆరోగ్య శాఖ వాహనంలో మందులను చేరవేయాలి. గత ఏడాదిగా ఇక్కడ పనిచేసే ఫార్మాసిస్టులను పిలిచి ఇస్తుండడంతో ఇవి గమ్యస్థానం చేరే లోపలే ప్రక్కదారి పడుతున్నాయి.**

జిల్లా వైద్య ఆరోగ్యశాఖ కార్యాలయ అధికారులు, సిబ్బంది ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు మందుల సరఫరా చేయడంలో చేతివాటం ప్రదర్శిస్తున్నారు. ప్రజలకు అన్నికాల మందులు అందుబాటులో వుంచి వాటిని పిహెచ్‌సిలకు ముందుగా పంపిణీ చేయాల్సిన వారు తప్పించుకుంటున్నారు. జిల్లాలోని అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఫార్మాసిస్టులను జిల్లా కేంద్రానికి పిలిచి మందులను తీసుకెళ్లాలని చెబుతున్నారు. మహిళా ఫార్మాసిస్టులు వీటిని మండల కేంద్రాలకు తీసుకెళ్లేందుకు నానా అవస్థలు పడాల్సి వస్తుంది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు ప్రతి మూడు నెలలకోసారి ప్రభుత్వ నిబంధనల ప్రకారం వైద్య ఆరోగ్యశాఖ వాహనంలో మందులను చేరవేయాల్సి వుంటుంది. గత సంవత్సరం నుంచి పిహెచ్‌సిల్లో పని చేస్తున్న ఫార్మాసిస్టులను పిలిపించి 5 నుంచి 10 బస్తాల్లో మందులు ఇచ్చి పంపుతున్నారు.

మందులు రవాణా చేసేందుకు ఆసుపత్రి అభివృద్ధికి కేటాయించిన నిధుల నుంచి ఖర్చు చేసుకోవాలని నోటి మాటగా అధికారులు చెప్పి చేతులు దులుపుకుంటున్నారని సిబ్బంది వాపోతున్నారు. ఉన్నతాధికారుల నుంచి రాతపూర్వకంగా ఉత్తర్వులు లేనిదే ఆసుపత్రి అభివృద్ధికి కేటాయించిన నిధుల్ని ఖర్చు చేసేందుకు అవకాశం లేదు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు సరఫరా చేసే మందుల్లో ఖరీదైనవి వుంటాయి. కొన్ని అట్టపెట్టెల్లోనూ, మరికొన్నింటిని సాధారణ బస్తాల్లో సర్ది మూటకడుతున్నారు. వీటిని ఆటోల ద్వారా బస్టాండ్‌కు చేర్చి అక్కడ నుంచి బస్సులో తీసుకెళ్లేందుకు దించే సమయంలో ఏమాత్రం చేయి జారినా కొన్ని మందుల సీసాలు పగిలిపోయే ప్రమాదం వుందంటున్నారు. ఫార్మాసిస్టుల ద్వారా లక్షలాది రూపాయలు విలువ చేసే మందులను పంపించడం పట్ల విమర్శలు తలెత్తుతున్నాయి. డాక్టర్ల ప్రమేయం లేకుండానే తీసుకెళ్తుండడంతో ఇవి ప్రక్కదారి మళ్లే అవకాశం లేకపోలేదు.

జిల్లా వైద్య, ఆరోగ్యశాఖ అధికారుల నిర్లక్ష్యం కారణంగా మందులు సరఫరాలో తీవ్ర ఆటంకాలు ఏర్పడుతున్నాయని క్రిందిస్థాయి సిబ్బంది ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఆసుపత్రి అభివృద్ధి నిధులు వివిధ పనుల కోసం ఖర్చు చేస్తుంటారు. మండల తహశీల్దార్, ఎంపిడిఓ, పిహెచ్‌సి వైద్యులు కమిటీగా వుంటారు. ఈ ముగ్గురు అధికారులు సమావేశం ఏర్పాటు చేసుకుని నిధుల ఖర్చుకు సంబంధించి తీర్మానం చేయాల్సి వుంటుంది. కాని కొందరు వైద్యులు తీర్మానాలు లేకుండానే నిధులు డ్రా చేసి ఖర్చు చేసేస్తున్నారు. ఆడిట్ సమయంలో మినిట్‌బుక్‌లో పాత తేదీలతో తీర్మానాలు రాసి మిగిలిన అధికారుల చేత సంతకాలు చేయిస్తుంటారన్న ప్రచారం వుంది. దీంతో ఎక్కువ భాగం నిధులు దుర్వినియోగం జరిగిపోతున్నాయి. జిల్లాశాఖ కార్యాలయంలో పని చేస్తున్న కొందరు ఉద్యోగులు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల వైద్యులతో కుమ్మక్కై తప్పుడు బిల్లులు సృష్టించి సహకరిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి.

ఇటీవల వింజమూరు మండలం చాకలికొండ ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఆసుపత్రి అభివృద్ధి నిధులు దాదాపు 4లక్షలకు పైగా దుర్వినియోగం జరిగినట్లు అధికారులు తనిఖీలో తేలింది. జాతీయ గ్రామీణ ఆరోగ్యమిషన్ క్రింద కేటాయించిన నిధుల్ని ఆసుపత్రి అవసరాలకు వినియోగించకుండా ప్రక్కదారి మళ్లించినట్లు అధికారులు గుర్తించారు. నిధులు ఖర్చుకు సంబంధించిన రికార్డులు, ఓచర్లను స్వాధీనం చేసుకొని జిల్లా కేంద్రానికి తీసుకొచ్చారు. కలువాయి పిహెచ్‌సి డాక్టర్ అవినీతి, అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలపై సస్పెండ్ చేస్తున్నట్లు జిల్లా అధికారి ప్రకటించారు. ఈ ప్రకటన చేసి నాలుగు నెలలు గడిచిన సస్పెండ్ మాత్రం చేయలేదు. ఉన్నతాధికారులు రాజకీయ ఒత్తిళ్లు, ఇతర ప్రలోభాలకు గురై అక్రమాలకు పాల్పడ్డ వారిపై శాఖపరమైన చర్యలు తీసుకునేందుకు వెనుకంజ వేస్తున్నట్లు తెలుస్తుంది.

ఇటీవల కాలంలో వైద్య ఆరోగ్యశాఖ పనితీరు ఆశాజనకంగా లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుంచి విడుదల చేస్తున్న నిధుల్ని ఏదో ఒక విధంగా ఖర్చు చేసి పంపకాలు చేసుకునేందుకు అధిక ప్రాధాన్యతనిస్తున్నారని ఆ శాఖలో గుసగుసలు వినిపిస్తున్నాయి.

# కామెడీ బాద్‌షా!



అల్లూరు రహీం

తన 13 ఏళ్ల సినీ కెరీర్‌లో ఎప్పుడూ లేనంతగా హిట్ కోసం పరితపిస్తున్నాడు హీరో ఎన్టీఆర్. ఆయన సమకాలీకులైన మహేష్‌బాబు, రామ్‌చరణ్‌తేజ, అల్లు అర్జున్, ప్రభాస్‌లు ఇటీవల నటించిన చిత్రాలు బాగా ఆడాయి. ఈ సమయంలో తన సత్తా కూడా నిరూపించుకోవాలని దూకుడు చిత్రంతో పరిశ్రమలో దర్శకునిగా ముందుకు దూసుకెళ్లిన శ్రీను వైట్ల నిర్దేశకత్వంలో బాద్‌షా చిత్రంలో నటించను ఒప్పుకొన్నాడు ఎన్టీఆర్. బాద్‌షా టైటిల్‌పరంగా చూస్తే అదరగొడుతుంది. ఎన్టీఆర్‌ను కొత్తగా చూపను వేసుకొన్న దుస్తులు, తొడుక్కున్న చెప్పులు, ధరించిన వాచీ ఇలా ప్రతి విషయంలోనూ దర్శకుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నాడు. నిర్మాత బండ్ల గణేష్ కాబట్టి ఎనిమిది అందమైన దేశాల్లో షూటింగ్ ఇబ్బంది లేకుండా పూర్తి చేశాడు. శ్రీను వైట్ల సినిమాలో కామెడీదే అగ్రస్థానం. కథ మాఫియా గ్యాంగులతో ప్రారంభమైనా చివరికి కామెడీ ట్రాకుతోనే ముగుస్తుంది. ఈ చిత్రకథ ప్రథమార్థంలో బలం లేదు. దీన్ని కవర్ చేయను ద్వితీయార్థంలో 45 నిమిషాలపాటు నడిపిన కామెడీ ట్రాక్ బ్రహ్మాండంగా పేలింది. దీనిలో వంద మార్కులు ఇవ్వాలిన నటుడు బ్రహ్మానందం. ఆయనలో ఇప్పటివరకు బయట పడని కోణంలోని నటుడ్ని తెరపై దర్శకుడు చూపాడు. సుధ, ప్రగతి, కాజల్, మాధవీమాల తాగి నర్తించే కామెడీ పాటల పేరడీ పొట్ట చెక్కలయ్యేలా చేస్తుంది. నాజర్, బ్రహ్మానందంల మధ్య సాగే కామెడీ సీన్లు అద్భుతంగా కుదిరాయి. బాద్‌షా, నాపైటపై పచ్చనీ జండా చరణాలతో సాగే ఐటమ్ పాటలు జనాన్ని బాగా అలరిస్తాయి. బంతి పూల జానకి పాటలో హీరోయిన్ కాజల్ వెరైటీ స్టెప్పులు వేసింది. కామెడీ ట్రాక్‌లో కూడా ఆమె కష్టపడి నటించింది. బాద్‌షా క్యారక్టర్‌కు ఎన్టీఆర్ వాస్తవానికి చాలకపోయినా చావాలంటే బాద్‌షా ముందుండాలి. బతకాలంటే బాద్‌షా కిందుండాలి. చచ్చిన జంతువును సింహం ముట్టుకోదు. భయపడేవాడిని బాద్‌షా చంపడు. ట్రిగ్గర్ నొక్కకుండానే బుల్లెట్ వచ్చిందంటే అది బాద్‌షాదే అయ్యిండాలి వంటి పవర్‌ఫుల్ డైలాగులతోపాటు డ్యాన్స్‌లోనూ ఎన్టీఆర్ అదరగొట్టాడు. అయితే విజయ్ ఫైట్స్‌లో వెనుకపడ్డాడు. తమన్ సంగీతం, గోపి మోహన్, కోన వెంకట్ కథా విస్తరణ, కెవి.గుహన్ కెమెరా ఈ చిత్రాన్ని ప్రేక్షకులు చూసేలా చేయను సహకరించాయి. మూడు గంటలపాటు నడిచే సినిమాలు తీయడాన్ని దర్శకుడు శ్రీను వైట్ల తగ్గిస్తే బాగుంటుంది.




ఇక చిత్రకథలోనికి వెళ్తే బాద్‌షా(ఎన్టీఆర్) తండ్రి ధనరాజ్ (ముఖేష్‌రుషి) అంతర్జాతీయ మాఫియా డాన్ సాధుభాయ్ (కెల్లీ డోర్జీ) వద్ద పని చేస్తుంటాడు. మరో డాన్ విక్టర్ (ప్రదీప్ రావత్)తో వచ్చే తగాదాతో అతన్ని హతమారుస్తాడు బాద్‌షా. ఈ పరిణామం సాధుభాయ్ శిబిరంలో ప్రకంపనలు సృష్టిస్తుంది. సాధుభాయ్ గ్యాంగ్‌ను పట్టను హాంకాంగ్ వెళ్లే పోలీసు అధికారి (నాగబాబు)ను మరో పోలీసు అధికారి ఆది(నవదీప్) సహకారంతో సాధుభాయ్ చంపేస్తాడు. ఈ నేరం చేసింది బాద్‌షా అని అంతర్జాతీయ మీడియా ముందు ఆది చెబుతాడు. మాఫియాలకు బాద్‌షా అండర్ కాప్ అని తెలియదు. ఐజి రామచంద్ర(సాయాజీ షిండే) సూచనలతో అతను ముందు కెళ్తుంటాడు. హైదరాబాద్ పోలీసు కమిషనర్ పిల్లి జయకృష్ణ సింహ (నాజర్) కుమార్తె జానకి (కాజల్)ను ఇటలీలో భగ్న ప్రేమికుడిగా పరిచయం చేసుకొని కలుస్తాడు బాద్‌షా. ఈ పరిచయం వాళ్లిద్దర్నీ ప్రేమికులను చేస్తుంది. కాని ఆదితో జానకి పెళ్లి ఫిక్స్ చేస్తాడు జయకృష్ణ సింహ. దీంతో కథ హైదరాబాద్‌కు చేరుకొంటుంది. జానకి పెళ్లిని ఘనంగా జరపను ఈవెంట్ మేనేజర్ రామారావుగా వచ్చే బాద్‌షా నవ్వుల బాట పడతాడు. కథ పలు మలుపులు తిరుగుతుంది. ఈ మలుపులన్నింటికి పోలీసు అధికారి పద్మనాభ సింహ(బ్రహ్మానందం), రామారావు కారకులు. సినిమా దర్శకుడు రివేంజ్ నాగేశ్వరరావు(ఎంఎస్.నారాయణ) దీన్లో మరో ఉప కథ. బాద్‌షా క్లాస్ ప్రేక్షకులకు అంతగా నచ్చకపోయినా మాస్ ప్రేక్షకులకు మాత్రం కోడి పులుసు, వేడి గారెలు కలిపి తిన్నట్లుంది.

## అందమంటే...



బాలీవుడ్‌లో అందాల నటిగా పేరు గాంచింది మాధురీదీక్షిత్. శ్రీరామ్ నెనే పెళ్లి చేసుకొని కొన్నాళ్లపాటు అమెరికాలో గడిపిన ఆమె ఇద్దరు పిల్లలకు జన్మనిచ్చింది. ఆ తర్వాత మళ్లీ వెండి తెరపై దృష్టి పెట్టింది. ఇటీవల ఆమె గులాబ్‌గ్యాంగ్ అనే చిత్రంలో నటిస్తూంది. షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడుతూ అందమంటే మాటల్లో వర్ణించ లేనిది. అందం అదొక ప్రత్యేకమైన సబ్జెక్ట్. చాలా మంది అందం అంటే చర్మం చూసో, మనిషి ఆకృతిని చూసో ఓ నిర్ణయానికి వస్తుంటారు. అది చాలా తప్పు. మనసులోతుల్లో నుంచి పుట్టుకొస్తుంటుంది అందం. మనసు నిర్మలంగా ఉంటే... మనలో అందం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. అందం అంటే నాకు గుర్తుచ్చేది... సితారదేవి. ఆమెను తెరపై చూసినప్పుడంతా నాకు తెగ ముచ్చటేస్తుంటుంది. ఆమె నటన చూస్తూ నన్ను నేను మరచిపోతుంటాను. అంత అందంగా ఎలా కనిపిస్తోందా? అని ఆశ్చర్యపోతుంటాను. మధుబాల అన్నా ఇష్టమే. ఆమె ఓ చిన్న చిరునవ్వు నవ్వితే చాలు. తెర వెలిగిపోతుందంతే. వీరి అందం వెనుక ఉన్నదంతా వీళ్ల స్వచ్ఛమైన మనసులే అని తన ప్రగాఢ నమ్మకమంది మాధురీదీక్షిత్.

## ప్రియమణికి ఎదురు దెబ్బ!



సల్మాన్‌ఖాన్ సినిమాల్లో ఆయన ఫైట్లు, కండలే కాదు. ఐటమ్ పాటలు కూడా పాపులరే. అయితే షారూఖ్‌ఖాన్ చిత్రంలో ఇప్పటివరకు చెప్పుకోదగ్గ స్థాయిలో ఐటెమ్స్‌సాంగ్స్ ప్రాచుర్యం పొందలేదు. చైన్నె ఎక్స్‌ప్రెస్‌లో చిత్రించిన గీతంలో మసాలా దట్టించి వదిలారు. తమిళనాట ఉండే కూత్తు గీతాల తరహాలో... నాటు భంగిమలతో తీర్చిదిద్దారు. ఆ గీతంలో ప్రియమణి నర్తించింది. రాజు సుందరం నృత్యరీతులు సమకూర్చారు. అయితే సెన్సార్ బోర్డు ప్రత్యేక గీతాలపై కఠినంగా వ్యవహరించాలని నిర్ణయించుకొంది. మోతాదు దాటితే కత్తెరవేయడం, ఎ సర్టిఫికేట్ ఇవ్వడం లాంటి చర్యలు తీసుకోవాలనుకొంటుంది. ఈ నేపథ్యంలో తమ చిత్రంలోని పాట వివాదాల పాలవ్వడం ఎందుకని దర్శకుడు రోహిత్‌శెట్టి, హీరో షారూఖ్‌ఖాన్‌లు భావించారట. దీంతో మరోమారు పాట మొత్తం చిత్రించాలని చెప్పడంతో బాలీవుడ్‌లో వెలుగుదామని ఎన్నో ఆశలు పెట్టుకొని ముంబాయి వెళ్లిన ప్రియమణి హతాశురాలయ్యింది.

## చాలా కష్టపడ్డాను!



గుండెల్లో గోదావరి చిత్రం విజయవంతం కావడంతో ఈ చిత్ర నిర్మాత మంచులక్ష్మి ఆనందంగా ఉంది. అమెరికాలో ఉన్నప్పుడు తాను నటినికాను పడ్డ కష్టాలును ఓసారి గుర్తు చేసుకొందామె. నేను అమెరికాలో చదువుతున్నాను అని మాత్రమే అమ్మా, నాన్నలకు తెలుసు. ఏం చదువుతున్నానో చెప్పలేదు. నాకు నటనపై ఉండే ఆసక్తి చదువుపై ఉండేది కాదు. స్వంతకాళ్లపై నిలబడాలని హోటల్‌లోనూ, నగల దుకాణంలోనూ, స్టోర్‌లోనూ పార్ట్‌టైమ్ ఉద్యోగాలు చేశాను. ఒక్లహోమాలో స్నేహితుల క్రెడిట్‌కార్డ్ ఉపయోగించుకుని మరీ ఒక్లహోమాసిటీ యూనివర్శిటీలో నటనలో బ్యాచిలర్ డిగ్రీ చేశాను. ఇండియా వచ్చాక కోవెలమూడి ప్రకాష్ అనగనగా ఓ ధీరుడు చిత్రంలో నన్ను విలన్‌ను చేశాడు. ప్రస్తుతం నా ప్రస్థానం ఏవిధంగా సాగుతుందో అందరికీ తెలుసు. మహిళల్లో అద్భుత శక్తి దాగుంటుంది. దాన్ని సరైన రీతిలో ఉపయోగించుకొంటే అద్భుతాలు సృష్టించవచ్చుంది.

## చాలా సంతోషంగా ఉంది!



కన్నడ హీరోయిన్ ప్రణీతకు తెలుగులో ఇప్పటివరకు ఓ హిట్ చిత్రం లేదు. అయితేనేం స్టార్ హీరో పవన్‌కళ్యాణ్ చిత్రంలో నటించే ఛాన్స్ దక్కింది. తివిక్రమ్ దర్శకత్వంలో బీవీఎస్ఎన్ ప్రసాద్ ఓచిత్రం నిర్మిస్తున్నారు. పవన్‌కళ్యాణ్ కథానాయకుడు. ఇందులో ప్రధాన నాయికగా సమంత నటిస్తోంది. మరోపాత్ర ప్రణీతకు దక్కింది. ఈ అవకాశం గూర్చి మాట్లాడుతూ పవన్‌కళ్యాణ్ చిత్రంలో నటిస్తున్నాను అని తెలియగానే గాల్లో తేలినట్లు అనిపించింది. ఇప్పటికీ ఆ అవకాశాన్ని తలచుకొంటే భలే సంతోషమనిపించింది. ఇటీవలే మాపై సన్నివేశాలు చిత్రించారు. ఒక విధమైన ఆనందోద్వేగంతో వెళ్లాను. పవన్‌కళ్యాణ్‌గారు హీరోయిన్లకు ఎంతో మర్యాదిస్తూ ప్రోత్సహిస్తారని చెప్పుకొచ్చింది.

## హంసా నందినికి అవకాశాలు!



అనుమానాస్పదం, ప్రవరాఖ్యుడు లాంటి చిత్రాల్లో నటించిన హంసా నందినికి హీరోయిన్‌గా అవకాశాలు కరవయ్యాయి. అందుకే ప్రత్యేక గీతాల వైపు మొగ్గు చూపుతోంది. ఆ మధ్య రానా నటించిన నా ఇష్టంలో అందాలు ఆరబోసింది. ఫిబ్రవరిలో వచ్చిన మిర్చి చిత్రంలో టైటిల్‌సాంగ్‌లో తళుక్కున మెరిసింది. ఈ పాట ప్రాచుర్యం పొందడంతో నాగార్జున 'భాయ్' చిత్రంలో ఐటమ్‌పాటలో నర్తించే అవకాశమిచ్చాడు. పెళ్లి వేడుక నేపథ్యంలో మొదలయ్యే పాటను హంసానందినిపై దర్శకుడు వీరభద్రమ్ తీశాడు.



# 14న సిఎం సూళ్లూరుపేట రాక!

## ● నెల్లూరు బాట అల్లుడికి నచ్చినట్లుంది

రాష్ట్ర ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి రెండవ విడత ఇందిరమ్మ బాట కార్యక్రమంలో పాల్గొనేందుకు ఈ నెల 14న జిల్లాకు రానున్నారు. తొలి విడతలో కొన్ని అసెంబ్లీ నియోజకవర్గాల్లో మాత్రమే ఇందిరమ్మ బాట కార్యక్రమంలో పాల్గొన్న ఆయన రెండవ విడతలో సూళ్లూరుపేట నియోజకవర్గంలో పర్యటిస్తానని సిఎం ప్రకటించారు. అంబేద్కర్ జయంతి రోజున సూళ్లూరుపేటకు విచ్చేసి ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళికపై సమీక్షించే అవకాశం వుంది. ఇందుకోసం అధికార యంత్రాంగం ముందస్తు ఏర్పాట్లలో నిమగ్నమైంది. అధికార పార్టీ ఎమ్మెల్యేలు ప్రాతినిధ్యం వహిస్తున్న ఆత్మకూరు, సర్వేపల్లి, నెల్లూరు నగరం నియోజకవర్గాలతో పాటు ప్రతిపక్ష పార్టీ ఎమ్మెల్యేలకు చెందిన గూడూరు, వెంకటగిరి, కోవూరు అసెంబ్లీ నియోజకవర్గాలలో ఇందిరమ్మ బాట నిర్వహించడం జరిగింది. రెండవ దఫా సూళ్లూరుపేట అసెంబ్లీ నియోజకవర్గ పరిధిలో ఇందిరమ్మ బాట కార్యక్రమానికి ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి కోరికమేరకు రానున్నట్లు తెలిసింది. ఇప్పటివరకు 12 జిల్లాల్లో ఇందిరమ్మ బాట కార్యక్రమం నిర్వహించిన సిఎం రెండవ దఫా అదే జిల్లాలకు వెళ్లిన దాఖలాల్లేవు. నెల్లూరు జిల్లాకు రెండవ దఫా రానున్నట్లు ప్రకటించడంతో వివిధ శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలు చేయించేందుకు కార్యక్రమాలను రూపొందిస్తున్నారు అధికారులు.



నెల్లూరులో జనహిత వాత్సల్య నేతృత్వంలో నడిచే భారతీయ విద్యావికాస్ స్కూల్‌లో క్రీడలను ప్రారంభిస్తున్న ప్రముఖ కాంట్రాక్టర్, దాత వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి. ప్రక్కన సామంతు గోపాల్‌రెడ్డి.

## ● సూడాన్ విద్యార్థులను

# మోసం చేసిన స్వాతి సైన్స్ అండ్ ఆర్ట్స్ కాలేజి!

**అరబ్బీకి బదులు తెలుగు, సంస్కృతంతో ప్రశ్నాపత్రం**

పరీక్షల నిర్వహణలో అటు అధికారులు, ఇటు కళాశాలల కరస్పాండెంట్ల నిర్లక్ష్యం కారణంగా విద్యార్థులు బలైపోతున్నారు. బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలని కోర్సులు, లాంగ్వేజీలు ఎంపిక చేసుకుని పరీక్షలు వ్రాసేందుకు సిద్ధమవుతుంటారు. అయితే తీరా పరీక్ష వ్రాసేందుకు వచ్చిన విద్యార్థులు పేపర్లు తారుమారవడంతో బిక్కమొహం వేయాల్సి వచ్చింది. పదవ తరగతి పరీక్షలు, ఇంటర్ పరీక్షలతోపాటు డిగ్రీ పరీక్షల్లోనూ ఇలాంటి ఘటనలు చోటు చేసుకోవడంతో విద్యార్థిలోకం ఆందోళన చెందుతున్నది. పదవ తరగతి పరీక్షల్లో ఉదయగిరిలో సంస్కృతం పేపర్ వ్రాయాల్సిన విద్యార్థులకు తెలుగు సబ్జెక్ట్ పేపర్ అందడంతో ఆ పరీక్షా కేంద్రం విద్యార్థులు ఏవి వ్రాయాలో తెలియక కన్ఫ్యూజ్ పర్యంతమయ్యారు. ఇలాంటి ఘటనే డిగ్రీ పరీక్షల్లోనూ చోటుచేసుకొంది. సుడాన్ దేశానికి చెందిన పలువురు విద్యార్థులు అరబిక్ కోర్సు నేర్చుకోవడానికి, ఫార్మసీ కోర్సుకు వెంకటాచలం వద్ద గల స్వాతి సైన్స్ అండ్ ఆర్ట్స్ కళాశాలలో చేరారు. ఖండాంతరాలు దాటి వచ్చి విద్య నేర్చుకొనేందుకు వచ్చిన వీరికి కళాశాల నిర్వాహకులు, యూనివర్శిటీ పరీక్షల అధికారుల తీరు వలన తీవ్ర నష్టం వాటిల్లింది. డిగ్రీ పరీక్ష వ్రాసేందుకు వీరికి జిల్లా జైలు వద్దనున్న వెంకటేశ్వర డిగ్రీ కళాశాలలో పరీక్షా కేంద్రాన్ని కేటాయించారు. పలువురు విద్యార్థులు అరబిక్ వ్రాయడానికి సిద్ధమవగా వారికి తెలుగు, సంస్కృతం ప్రశ్నాపత్రాలు ఇన్విజిలేటర్లు ఇవ్వడంతో భాష అర్థంకాని సుడాన్ విద్యార్థులు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. తమకు జరిగిన నష్టాన్ని చెప్పుకొనేందుకు భాష సమస్యకాగా, పరీక్షల అధికారులతోపాటు వేలాది రూపాయలు ఫీజులుగా కట్టించుకొన్న స్వాతి కళాశాల కరస్పాండెంట్ సక్రమంగా స్పందించకపోవడంపై ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. వీరికి ఎబివిపి విద్యార్థులు అండగా నిలచారు. విక్రమ సింహపురి యూనివర్శిటీలో అరబిక్ నేర్పే అధ్యాపకులు లేకుండా ఆ కోర్సు చేసేందుకు కళాశాలకు ఎలా పర్మిషన్ ఇచ్చారని విద్యార్థి సంఘ నాయకులు ప్రశ్నిస్తున్నారు. దీనిపై విచారణ జరిపి విద్యార్థులకు తగిన న్యాయం చేయాలని కోరుకొంటున్నారు.



నాసా, ఎయిర్ స్పేస్ సెటిల్‌మెంట్ డిజైన్ కాంటెస్ట్‌లో బహుమతి పొందిన నెల్లూరు రవీంద్ర భారతి స్కూల్ విద్యార్థి బి.అభిషేక్ అభినందన సభలో స్కూల్ డీన్ శైలజ, ప్రిన్సిపాళ్లు, శ్రీధర్, కృష్ణప్రసాద్, వరప్రసాద్, సుజాత, సౌందర్యలక్ష్మి.

# విద్యుత్ ఛార్జీల పెంపుపై వెల్లువెత్తిన నిరసనలు!



ధర్నా చేస్తున్న టిడిపి నాయకులు.

కాంగ్రెస్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై వివిధ పార్టీలు చేస్తున్న ఆందోళనలు, నిరసనలతో నగరం దద్దరిల్లి పోతోంది. నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి, విద్యుత్ ఛార్జీలు పెరిగి సామాన్య, మధ్యతరగతి ప్రజలు కుటుంబాలను పోషించుకోలేక సతమతం అవుతున్నారు. ఈ పరిస్థితుల్లో మరింతగా విద్యుత్ ఛార్జీలను పెంచుతూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ప్రజలు ప్రభుత్వ తీరుపై మండి పడుతున్నారు. వీరికి ప్రతిపక్ష పార్టీలు అండగా నిలుస్తున్నాయి. ప్రజల నుంచి తమ పార్టీలకు మద్దతు కూడగట్టడంతోపాటు తమ ఉనికిని చాటుకొనేందుకు పోటాపోటీగా ఆయా పార్టీలు నిర్వహిస్తున్న ఆందోళనలతో స్వామి కార్యం, స్వకార్యం రెండూ చక్కబెట్టుకొన్న చందంగా వుంది పార్టీల తీరు. ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ, కొత్తగా వచ్చిన వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీలతోపాటు బిజెపి, వామపక్ష పార్టీలు ఎవరికి వారుగా ఈ అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని ప్రజల పక్షాన మేమున్నామంటూ పోటీలు పడి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు. తెలుగుదేశం, బిజెపి పార్టీలు రాజధానిలో తమ నేతలు చేపట్టిన నిరసన దీక్షలకు అనుబంధంగా నగరంలోనూ విఆర్‌సి, గాంధీబొమ్మ వద్ద రిలే నిరాహార దీక్షలు చేపట్టారు. జిల్లాలో ముఖ్యమంత్రి పర్యటిస్తుండడంతో పోలీసులు బలవంతంగా ఈ దీక్షలను విరమింప జేశారు. నగర డిఎస్పీ ఒకడుగు ముందుకేసి ఏకంగా మినీ బైపాస్ రోడ్డులోగల బిజెపి జిల్లా కార్యాలయంలోకి వెళ్లి అక్కడ వున్న నేతలను అరెస్టు చేయడంపై విమర్శలు చెలరేగాయి. మొత్తంమీద వివిధ పార్టీలు ప్రభుత్వ తీరును దుయ్యబట్టడంలో పోటాపోటీగా వ్యవహరిస్తున్నాయి.

## కలగా ఎయిర్ పోర్ట్!

జిల్లాలో చాలా సంవత్సరాల నుంచి విమానాశ్రయం ఏర్పాటు కానుందని ప్రచారం జరుగుతూనే వుంది. తొలుత నెల్లూరు శివారు ప్రాంతం కొత్తూరు సమీపంలో విమానాశ్రయం ఏర్పాటు జరుగుతుందని, ఆ తర్వాత దగదర్తి మండలం దామవరం, సున్నపుబట్టి గ్రామాల సమీపంలో ఏర్పాటు చేస్తారని రాజకీయ నేతలతో సహా ఎవరికి తోచిన విధంగా వారు ప్రకటనలు గుప్పించారు. చివరకు ఆర్థికశాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి దామవరం సమీపంలో విమానాశ్రయం ఏర్పాటు చేయనున్నట్లు గత నెలలో అధికారికంగా ప్రకటించిన సంగతి తెలిసిందే. ఈ సంవత్సరం ఆఖరుకు రాష్ట్ర ముఖ్యమంత్రి చేత శంకుస్థాపన కూడా చేయించనున్నట్లు వెల్లడించారు. మొన్నటి నెల్లూరు పర్యటనలో సిఎం ఈ విషయమై ఎటువంటి హామీ ఇవ్వలేదు.




సదస్సులో మాట్లాడుతున్న తులసిరెడ్డి. ప్రక్కన ప్రెస్ అకాడమీ ఛైర్మన్ సురేంద్ర.

# పాత్రికేయులు వృత్తి నైపుణ్యం పెంచుకోవాలి!

పాత్రికేయులు వృత్తి నైపుణ్యాన్ని పెంపొందించుకోవాలని రాష్ట్ర ప్రెస్ అకాడమీ ఛైర్మన్ తిరుమలగిరి సురేంద్ర సూచించారు. ప్రెస్ అకాడమీ, విక్రమ సింహపురి యూనివర్శిటీ సంయుక్త ఆధ్వర్యంలో గ్రామీణ విలేకరుల శిక్షణా కార్యక్రమాలు విక్రమ సింహపురి యూనివర్శిటీలో రెండు రోజులపాటు జరిగాయి. ఈ శిక్షణా కార్యక్రమాన్ని జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించిన అనంతరం ప్రెస్ అకాడమీ ఛైర్మన్ మాట్లాడుతూ పోటీ ప్రపంచంలో పాత్రికేయులు వృత్తిపరంగా నైపుణ్యాన్ని పెంపొందించుకొంటేనే ఈ రంగంలో మరింతగా రాణించేందుకు అవకాశం కల్గుతుందన్నారు. అందుకోసం ప్రెస్ అకాడమీ వివిధ కార్యక్రమాలను రూపొందిస్తుందన్నారు. జెఎన్‌టియూ సహకారంతో వర్కింగ్ జర్నలిస్టులకు ఫోటో జర్నలిజం, డిజిటల్ టెక్నాలజీ, మీడియా కోర్సుల్లో శిక్షణా కార్యక్రమాలు నిర్వహిస్తున్నట్లు తెలిపారు. ఒక్కొక్క కోర్సులో 20 మంది వరకు శిక్షణ తీసుకొనే అవకాశం వుందన్నారు. హైదరాబాద్‌లోని తెలుగు యూనివర్శిటీతో ఒప్పందం కుదుర్చుకుని ఏటా 40 మంది జర్నలిస్టులకు ఎంఏ జర్నలిజం కోర్సు చదవను ఫీజు రాయితీ ఇప్పిస్తున్నామన్నారు. రెండో రోజు జరిగిన శిక్షణా కార్యక్రమంలో 20 సూత్రాల అమలు కమిటీ ఛైర్మన్ డాక్టర్ ఎన్.తులసిరెడ్డి పాల్గొని ప్రసంగించారు. పత్రికా రంగంలో విశ్వసనీయతకు పెద్దపీట వేయాలన్నారు. విమర్శలకే కాకుండా అభివృద్ధి పనులకు ప్రాధాన్యతనివ్వాలన్నారు. విక్రమ సింహపురి యూనివర్శిటీ విసి రాజారామిరెడ్డి కూడా పాల్గొన్నారు.

## సునీతా లక్ష్మారెడ్డి?

మొదటి పేజీ కొరవ

న్నది. న్యాయస్థానంలో అభియోగం అంటే, నిందితులుగా ధృవపరచినట్లు లెక్క. విచారణలో వారి నేరం రుజువు కావచ్చు కాకపోవచ్చు. అయితే అప్పటి వరకు వారు నిందితులే. ప్రభుత్వ ఖజానాకు కన్నం పెట్టిన నేరంలో కోర్టు విచారణ జరిపేటప్పుడు అదే ప్రభుత్వంలో మంత్రులుగా కొనసాగడం కంటే హీనమైన విషయం వేరొకటి వుండదు. కానీ విచిత్రంగా మన ముఖ్యమంత్రి, కాంగ్రెస్ అధిష్టానవర్గం ఈ నిందిత మంత్రులను వెనకేసుకొని వస్తున్నది. ధర్మాన ప్రసాదరావు రాజీనామాను నెలల పర్యంతం నానబెట్టి, అందరూ ఆ విషయాన్ని మర్చిపోయిన తర్వాత గుట్టుచప్పుడు కాకుండా చెత్త బుట్టలో వేశాడు ముఖ్యమంత్రి. ఇప్పుడు హోంమంత్రి సబిత ఇంద్రారెడ్డి విషయంలోను అదే నాటకం మొదలు పెట్టాడు. పైపెచ్చు సహచర మంత్రులు గుంపుగా వెళ్లి రాజీనామా చేయవద్దని సబితమ్మకు సలహా ఇచ్చి వస్తున్నారు. వారి భయం – ఈ రోజు ఆమెకు జరిగింది రేపు తమకూ జరగవచ్చునని.

కానీ ఒకరిద్దరు మంత్రులను కాపాడడానికి మొత్తం ప్రభుత్వం ప్రతిష్టను పణంగా పెడుతున్నది కాంగ్రెస్ పార్టీ. సిబిఐ అనేది ఆకాశం నుంచి వూడి పడిన సంస్థ కాదు. పూర్తిగా ప్రభుత్వ ఆధీనంలో నడిచే ఒక విభాగం మాత్రమే. జగన్ మీద విచారణ జరపడంలో ప్రభుత్వానికి ప్రత్యక్ష ప్రమేయం లేకపోవచ్చు కానీ, దాన్ని నడిపిస్తున్నది మాత్రం ప్రభుత్వమే. జయలలిత, మాయావతి, ములాయం సింగ్, లల్లూ ప్రసాద్ యాదవ్ వంటి వారందరి మీదా సిబిఐ అభియోగాలున్నాయి. కానీ వారెవ్వరి విషయంలోనూ లేని స్పష్టత జగన్ విషయంలో కన్పిస్తున్నది. విడవకుండా దర్యాప్తు జరుగుతున్నది. జగన్ మీద కేసు నడుపుతూ, ఆయనతో భాగస్వాములుగా తేలిన మంత్రుల మీద మాత్రం దయ కరుణ ఎందుకు? దాని అర్థం ఏమిటి? జరిగిన అవినీతి మొత్తానికి జగన్ ఒక్కడిని బాధ్యుడ్ని చేయడం సాధ్యమా? అది భావ్యమా? దీనివల్ల ఒక విషయం స్పష్టమౌతున్నది. జగన్ మీద రాజకీయ దృక్పథంతో మాత్రమే కేసు నడుస్తున్నదన్న భావన కలుగుతున్నది. ప్రజలలో తప్పుడు సంకేతాలు వెళ్తున్నాయి. సిబిఐ ప్రతిష్ట మసకబారుతున్నది. అవినీతి మొత్తానికి జగన్ బాధ్యుడై వుండవచ్చు, లబ్దిదారుడై వుండవచ్చు. కానీ ఆ అవినీతికి సహకరించిన వారు, సంతకాలు పెట్టి ఫైళ్లు నడిపిన మంత్రులు, అధికారులు బాధ్యత తప్పించుకోవడం ఎట్లా సాధ్యం? ఆ కుటిల ప్రయత్నం చేస్తే అసలు కేసు కోర్టులో నిలబడతుందా?

ఏది ఏమైనా తన మంత్రివర్గంలో ఇద్దరు మంత్రులు అవినీతి కేసులో నిందితులుగా కోర్టుకు హాజరయ్యే అవమానకర స్థితి కల్పించుకొన్నాడు ముఖ్యమంత్రి. ఇప్పుడు సబిత రాజీనామా ఆమోదిస్తే, దాని కంటే ముందు నుంచి నానుతున్న ధర్మాన రాజీనామాను కూడా ఆమోదించాలి; రేపు మరొక ముగ్గురు మంత్రుల రాజీనామాలు కూడా ఆమోదించాలి. దాని వల్ల మొత్తం మంత్రివర్గమే అవినీతి మంత్రుల సమాహారమన్న అభిప్రాయం ప్రజలలో కలుగుతుంది. మరొకప్రక్క ఎల్వీసుబ్రహ్మణ్యం వంటి ఐఎఎస్ అధికారులు చాలామంది మీద కూడా చర్యలు తీసుకోవాలి. ఇవన్నీ కలిసి ఎక్కడకు దారి తీస్తాయో అన్నది కాంగ్రెస్ పెద్దల భయం.

కంటి నీటి తుడుపుగా సబిత ఇంద్రారెడ్డిని హోం శాఖ నుంచి తప్పించి, అప్రధాన శాఖ ఏదో ఒకటి ఇస్తే పోతుందన్న ప్రతిపాదన ఒకటి పరిశీలనలో వుంది. సబితమ్మ స్థానంలో మరొక మహిళా మంత్రి సునీతా లక్ష్మారెడ్డిని హోంమంత్రిగా నియమిస్తారని చెప్తున్నారు. ఇద్దరూ రెడ్డి వర్గానికి, ఇద్దరూ తెలంగాణకు, ఇద్దరూ మహిళా కోటాకు చెందిన వారు కాబట్టి, ఎవరికీ అన్యాయం చేసిన భావన కలగకుండా చూసుకోవచ్చునని భావిస్తున్నారు.

ఏర్పాటుచేసినా అక్కడ సిబ్బంది పనితీరు బాగో లేదు. నవాబుపేట శివాలయం వెనుక ఏర్పాటు చేసిన ఆధార్ నమోదు కేంద్రంలో 200 రూపాయలు తీసుకొని వెనుక వచ్చిన వారి పేర్లను నమోదు చేస్తున్నారట. ఇళ్లకు వచ్చి ఆధార్ దరఖాస్తులు ఇస్తామన్న విషయం కూడా విఫలమయ్యింది. ఉన్నతాధికారులు ఈ విషయాలు పరిశీలించాలి.

## 24 గంటల కడుపు నొప్పా?

అపెండిసైటిస్‌ను సామాన్య భాషలో 24 గంటల కడుపునొప్పిగా పిలుస్తుంటారు. ఆ నొప్పి తీవ్రమైనపుడు 24 గంటల్లో ఆపరేషన్ చేయాల్సి వున్నందున ఆపేరొచ్చింది. మొన్న ముఖ్యమంత్రి పర్యటన సందర్భంగా పెద్దాస్పత్రిలో జరిగిన సభలో రాజీవ్ ఆరోగ్యశ్రీ ద్వారా లబ్దిపొందిన వారితో ముఖాముఖి కార్యక్రమాన్ని నిర్వహించాడు ముఖ్యమంత్రి. ఈ సందర్భంగా ఒక పిల్లవాడు తనకు 24 గంటల కడుపునొప్పిని ఆరోగ్యశ్రీ ద్వారా ఆపరేషన్ చేయించుకున్నానని చెప్పాడు. ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డికి ఈ పదం అర్థం కాలేదు. ఏంటి నీకు 24 గంటలూ కడుపు నొప్పా? అని ఆశ్చర్యపోగా వెనకే వున్న వైద్యులు అపెండిసైటిస్‌ని అలా అంటారని చెప్పడంతో అవునా? నాకు తెలియదే అని వ్యాఖ్యానించాడు ముఖ్యమంత్రి.

## టిబి ఆస్పత్రి మార్పుపై నిరసన

చాలా ఏళ్లుగా టిబి ఆస్పత్రి పొదలకూరు రోడ్డులో వుంది. ఇక్కడ కలెక్టరేట్ నిర్మాణ పనులు ప్రారంభించాలని తలపెట్టినందు వల్ల ఈ హాస్పిటల్‌ను రేబాలవారివీధిలో గల చిన్న పిల్లల ఆస్పత్రిలోకి మార్చి దానిని పెద్దాస్పత్రికి తరలించాలని అధికారుల ప్రయత్నం. చిన్నపిల్లల ఆస్పత్రిని పెద్దాసుపత్రికి మార్చడం బాగానే వున్నా టిబి ఆస్పత్రిని జనావాసాల మధ్యలో ఏర్పాటు చేయాలన్న దానిపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. స్థానికులు అధికారుల నిర్ణయంపై మండి పడుతున్నారు.

## టివి-9 క్రిష్ణమోహన్‌కు అవార్డుల వెల్లువ!

పక్షం రోజుల క్రితం దేశంలోని ఎలక్ట్రానిక్ మీడియాలోని జర్నలిస్టులకు న్యూస్ టెలివిజన్ సంస్థ ఇచ్చే బెస్ట్ రిపోర్టర్ అవార్డును కేంద్ర సమాచార శాఖ మంత్రి మనీష్‌తివారీ చేతుల మీదుగా నెల్లూరీయుడు టివి-9 తిరుపతి రిపోర్టర్ నందిగం క్రిష్ణమోహన్ అందుకొన్న సంగతి తెలిసిందే. తాజాగా ఢిల్లీలోని తెలుగు అకాడమీ ఉగాది సందర్భంగా వివిధ ప్రముఖులిచ్చే ఉత్తమ పురస్కారాల్లో జర్నలిస్టు పురస్కారాన్ని క్రిష్ణమోహన్‌కు ప్రకటించి 8వ తేది కేంద్ర మంత్రి కపిల్ సిబాల్ చేతులమీదుగా ప్రదానం చేసింది. ఈ కార్యక్రమంలో మరో కేంద్ర మంత్రి కిల్లి కృపారాణి, రాష్ట్ర ప్రభుత్వ ప్రిన్సిపల్ సెక్రటరీ సత్యనారాయణ పాల్గొన్నారు. జాతీయ స్థాయిలో పురస్కారాలు అందుకొంటున్న క్రిష్ణమోహన్‌కు మా అభినందనలు.

## మరణం



మాదరాజు గూడూరులో పెద్ద రైతు కుటుంబీకుడు యేటూరు సుబ్బరామిరెడ్డి(80) 3వ తేది నెల్లూరులో మరణించారు. గత 50 ఏళ్లుగా ఈయన నెల్లూరులోనే ఉంటున్నారు. జిల్లా ప్రణాళికా మండలి మాజీ సభ్యుడు, కాంగ్రెస్ నాయకుడు, ఒకప్పుడు నగర రాజకీయాల్లో చురుకుగా పాల్గొన్న వై.వి.రామిరెడ్డి ఈయన కుమారుడే. ఒక కుమార్తె కూడా ఉన్నారు. కుటుంబ పెద్దను కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

వ్యవస్థ పర్యవేక్షణకు ఒక సిఐ, ముగ్గురు ఎస్ఐలు, ఆరుగురు కానిస్టేబుళ్లను ఎస్పీ రమణకుమార్ నియమించారు. ప్రారంభమయ్యాక చూడాలి ఈ కొత్త పథకం ఫలితాలు.

## సద్దుమణగని ఆధార్ గొడవలు!

నెల్లూరు నగరంలో ఆధార్ కేంద్రాల ఏర్పాటు గొడవ ఇంకా సద్దుమణగ లేదు. కొన్ని కేంద్రాలు

## పెరుగుతున్న ద్వేషం

16వ పేజీ కొరవ

తెలంగాణలో మరికొందరు సీనియర్ ఎమ్మెల్యేలకు కూడా ఇదే చేదు అనుభవం ఎదురైంది. తెలంగాణలోని చాలా నియోజకవర్గాలలో కాంగ్రెస్‌కు 6 నుంచి 8 శాతానికి మించి ఓట్లు రావని సర్వేలు తెలుపుతున్నాయట. దాని అర్థం 1994లో వచ్చిన 26 సీట్లయినా ఈసారి వస్తాయా లేక రెండుకో ఆరుకో పరిమితమౌతాయా అన్న ఆందోళనలో పడిపోతున్నారు కాంగ్రెస్‌వాదులు.



## జనవాణి

2వ పేజీ కొరవ

మతం అనే చట్రంలో బంధించి కూపస్థ మండూకాల్లా తయారుచేశారు. ఇంకా చేస్తూనే వున్నారు. ఈనాటికీ కొందరు ముస్లింలు విద్యాధికులైనప్పటికీ జాతీయ దృక్పథం లేక జాతీయ సమస్యల పట్ల యుక్తాయుక్త విచక్షణలేక అమాయకం గానే ప్రవర్తిస్తున్నారు. ముస్లిం సమాజంలో ఉన్న అధిక పేదరికం, అధిక సంతానం మరియు నిరక్షరాస్యత వంటి సమస్యలను రూపుమాపి వారిని అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం ప్రయత్నించక క్షణికమైన ప్రలోభాలకు ఆకర్షింపజేసి రాజకీయ పబ్బం గడుపు కోవడం, మత పెద్దలు మతం పేరుతో భయపెట్టి వారిని పెడత్రోవ పట్టించడం చేస్తున్నారు తప్ప వారిని సక్రమమార్గంలో నడిపించి వారి పురోభివృద్ధి కోసం చేస్తున్నదేమీ లేదు.

షేక్ కరీంబాష — నెల్లూరు

## కార్పొరేషన్ బుర్రకథ బాగుంది!

బుర్రకథ ద్వారా నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ ప్రజలలోనికి వెళ్లడానికి చేసిన ప్రయత్నం హర్షించదగినది. ప్లాస్టిక్ కవర్ల వాడకం ద్వారా భయంకరమైన వ్యాధులు రావడమేగాక, ఆ కవర్లు మురుగు కాల్వలలో పారవేయడం వలన కాల్వల లోని నీరు కదలక నిల్చిపోయి దోమలు పెరిగి చికెన్ గున్యా, డెంగీ, మలేరియాలతోపాటు రకరకాల జ్వరాలు దోమకాటు వల్ల వస్తాయని బుర్రకథ కళాకారులు చెప్పడం బాగుంది. బుర్రకథ వ్యవహారం పాతదే అయినా జనాన్ని ఆకట్టుకొనేలా చెబుతున్న కళాకారులు, దీనికి శ్రీకారం చుట్టిన మాజీ కమిషనర్ ఆంజనేయులు అభినందనీయులు.

ఆదూరు రాఘవరావు — నెల్లూరు

## విద్యుత్ ఛార్జీల పెంపకంపై పోరాటం!

విద్యుత్ ఛార్జీలను ప్రభుత్వం ఇష్టమొచ్చినట్లు పెంచేయడం దారుణం. ఈ వ్యవహారంపై సిపిఎం, సిపిఐ, బిజెపి, టిఆర్ఎస్ పార్టీలు ఏకత్రాటిపై ఉద్యమించడం హర్షించవలసిన విషయం. అయినా సరే ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నెలకు 200యూనిట్లలోపు వినియోగించే వారికి మాత్రమే కొన్ని రాయితీలు ప్రకటించారు. మిగతావాళ్ల విషయంపై పెద్దగా శ్రద్ధ చూపలేదు. సర్‌ఛార్జీలు యథాతథంగా ఉంటాయనడం బాధాకరం. కరెంట్ ఛార్జీల పెంపకం అంశమొక్కటే రాబోయే ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ మట్టి కరవడానికి కారణభూతమవబోతోంది.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

## పదరంగం -62

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | 4 | | 5 | | 6 |
| 7 | | | | 8 | | 9 | | | |
| | | 10 | 11 | | | 12 | | | |
| | | 13 | | | 14 | | | 15 | |
| | 16 | | | 17 | | | 18 | | |
| 19 | | | 20 | | | 21 | | 22 | 23 |
| 24 | | | | 25 | | | 26 | | |
| | | | 27 | | | | 28 | | |
| 29 | | 30 | | | | 31 | | | |
| | | 32 | | | 33 | | | | |

**అడ్డం**

1. సాటి లేనిది, ఉపమానం లేనిది (6)
5. అతి గల స్త్రీ (3)
7. భర్త, సతికి పుంలింగము (2)
8. ఖగము యొక్క నఖము (4)
10. తిండి (3)
12. పశువుల తిండి (2)
13. శబ్దము, సడి (2)
14. రోజు (2)
15. అపకారం (2)
16. పని (2)
17. వర్షం (2)
18. త్రోవ, మార్గం (2)
19. చేను (2)
20. తల, శిరస్సు (4)
22. కోతి (2)
24. చెదిరిన లోగిలి (3)
25. తెల్లవారు జాము (4)
27. మన్మధుడు, కామేశ్వర రావుని ఇంట్లో పిలిచేది (3)
28. చెదిరిన కలరు (3)
29. స్త్రీలు (4)
31. సరస్వతి దేవి సంగీత వాయిద్యం (2)
32. బాద్రపదం తరువాతి నెల (2)
33. తడబడిన పురము (3)

నిలువు

1. సాయం సమయం రోజులో 3వ భాగం (4)
2. నుతించడం (2)
3. పట్టణం (3)
4. కబళం (2)
5. అరుణను పిలవండి (3)
6. పైట (4)
9. ఆవును దానమియ్యడం (3)
10. నిర్వహణ (3)
11. కీడు, అపకారం (2)
14. సూర్యుడు (5)
15. చేరడం, కలయిక (3)
16. సమయంలో (3)
17. నిజం (4)
19. ఊరి వెలుపలి ప్రాంతం (4)
21. క్రింద నుంచి గడ్డి మేటు (2)
23. ప్రముఖ కవి, రచయిత చినవీరభద్రుని ఇంటిపేరు, పెద్దలమర్రి కాదు (5)
26. సమయము (4)
27. కలుషితం (3)
30. కణువులో 2,3 అక్షరాలు (2)
31. పృష్టభాగం యేను వెనుకభాగం (2)

సమాధానాలు

## పదరంగం -61

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | భ | 2 య | 3 తా | ర | 4 కం | | 5 త | 6 ప | స్సు |
| ద | | 7 క్ష | మ | | 8 పి | త | రు | లు | |
| 9 జ | 10 లం | | 11 ర | 12 జి | తం | | 13 లు | కు | 14 ప |
| 15 ని | శీ | 16 ధి | | జ్ఞా | | 17 రా | | 18 బ | స |
| | | 19 ని | 20 ర | స | 21 న | | 22 బ | డి | |
| 23 స | 24 రి | | జ | | 25 మ | 26 ను | వు | | 27 సు |
| 28 మం | దా | 29 కి | ని | | 30 స్కా | ల | రు | | నా |
| త | | టి | | 31 దూ | రం | | | | యా |
| | 32 చా | కి | 33 రి | | | 34 అ | 35 డి | యా | స |
| 36 చి | చా | | 37 స | ద్దు | | 38 తి | కో | | ము |

# సంక్షిప్త సింహపురి

## వెయిటింగ్‌లో 10లక్షల గ్యాస్ కనెక్షన్లు!



కేంద్రంలోని మన్మోహన్ సింగ్ ప్రభుత్వానికి ఢోకాలేదని కేంద్ర చేనేత, జౌళి, పెట్రోలియం సహజ వనరుల శాఖా సహాయమంత్రి పనబాక లక్ష్మి చెప్పుకొచ్చారు. 4వ తేది హోటల్ హరితలో విలేకరులతో మాట్లాడారు. ప్రతి యేటా కేంద్ర ప్రభుత్వం గ్యాస్, డీజిల్, కిరోసిన్ తదితరాలపై 1.64 లక్షల కోట్ల రూపాయలు భారాన్ని సబ్సిడీ రూపంలో భరిస్తుంది. పెట్రోల్, డీజిల్, గ్యాస్, కిరోసిన్‌లపై రాష్ట్ర ప్రభుత్వాలు విధిస్తున్న పన్నుల వల్ల ప్రజలపై మరింత భారం పెరుగుతుందన్నారు. పర్యావరణం కాపాడేందుకు గ్రామీణ ప్రాంతాల్లో వంట గ్యాస్ వినియోగం విస్తృతమయ్యేలా అవసరమైన చర్యలు చేపడుతున్నాం. ఇందులో భాగంగా రాజీవ్ గాంధీ ఎల్‌పిజి మిత్రక్ యోజన క్రింద గ్రామీణ ప్రాంతాల్లో గ్యాస్ డీలర్ల సంఖ్య పెంచుతున్నామన్నారు. దేశంలో ఇంకా పది లక్షల గ్యాస్ కనెక్షన్లు వెయింగ్ లిస్ట్‌లో ఉన్నట్లు ఒక ప్రశ్నకు జవాబుగా పనబాక లక్ష్మి చెప్పారు.

## యువత ఆదర్శం కావాలి!

యువత సమసమాజ వికాసానికి సమాజంలో నిర్మాణాత్మక కార్యక్రమంలో భాగస్వాములై భావితరాల వారికి ఆదర్శంగా నిలవాలని రాష్ట్ర 20 సూత్రాల పథకం అమలు కమిటీ ఛైర్మన్ డాక్టర్ ఎన్.తులసిరెడ్డి సలహాయిచ్చారు. కస్తూరిబా కళాక్షేత్రంలో 4వ తేది రాజీవ్ యువ కిరణాల యువతతో ఇష్టాగోష్టి కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రధానంగా మానవ జీవితంలో యవ్వనం దశలోనే యువతీ యువకులు కష్టపడి స్వయంశక్తితో ఉపాధి అవకాశాల కల్పన వైపు దృష్టి సారించాలన్నారు. యువత కేవలం ప్రభుత్వ ఉద్యోగాలనే ఆశించకూడదు. ప్రైవేట్ రంగంలో స్వయం ఉపాధి రంగాలలో తమ శక్తి సామర్థ్యాలు, నైపుణ్యాలతో అనూహ్యమైన ప్రగతి సాధించ వచ్చన్నారు. దీనిలోభాగంగా రాష్ట్ర ప్రభుత్వం ఇంటర్ లోపు చదువు మానేసిన నిరుద్యోగ యువతీ యువకులకు ప్రత్యక్షంగాను పరోక్షంగాను ఉద్యోగ అవకాశాలు కల్పించేందుకు వినూత్న రీతిలో రాజీవ్ యువ కిరణాలు కార్యక్రమం ప్రతిష్టాత్మకంగా ప్రవేశపెట్టి అమలు చేస్తుందన్నారు. ఈ కార్యక్రమం ద్వారా యువతీ యువకులకు వారి నైపుణ్యతను బట్టి అవసరమైన శిక్షణా కార్యక్రమాలు నిర్వహించి ప్రైవేటు రంగాలలో ఉద్యోగాలు కల్పిస్తామన్నారు. దీనికోసం బడ్జెట్‌లో 1800 కోట్ల రూపాయలు కేటాయించామన్నారు.

## సిఎంకు గ్రామ రెవిన్యూ అధికార్ల మొర!

నెల్లూరు పర్యటనకు వచ్చిన ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి పినాకినీ అతిథి గృహంలో 2వ తేది కలసిన ఆంధ్ర ప్రాంత గ్రామ రెవిన్యూ అధికారుల సంక్షేమ సంఘం రాష్ట్రనేత పంటా అశోక్‌కుమార్ రెడ్డి దీర్ఘకాలంగా ఉన్న తమ సమస్యలను పరిష్కరించాలని అభ్యర్థించారు. ఇంటర్ ఆపైబడి విద్యార్హత కలిగిన రికార్డ్ అసిస్టెంట్ స్కేలుపై పనిచేస్తున్న విఆర్వోలందరికి జూనియర్ అసిస్టెంట్ స్కేలు ఇచ్చి గ్రేడ్-1 విఆర్వోలుగా అప్‌గ్రేడ్ చేయాలన్నారు. ఇంటర్మీడియట్ అర్హతలేని విఆర్వోలకు జూనియర్ అసిస్టెంట్ స్కేలుతో గ్రేడ్-1 విఆర్వోలుగా అప్‌గ్రేడ్‌చేసి ఇంటర్మీడియేట్ అర్హతతో ఐదేళ్ల గడువు విధించే విధంగా అవకాశం కల్పించాలన్నారు. జిఓ ఎంఎస్ నెం.39 ప్రకారం విఆర్వోలుగా నియామకం కాబడిన వారికి 458 నెంబరు జిఓలో ఉన్న నిబంధనతో సంబంధం లేకుండా మిగతా ప్రభుత్వ ఉద్యోగులు అయిన రికార్డు అసిస్టెంట్ మరియు జూనియర్ అసిస్టెంట్ల మాదిరిగా సర్వీసు క్రమబద్దీకరణ, ప్రొబేషన్ పీరియడ్ డిక్లేర్ చేయాలన్నారు. మొత్తంమీద 10 సమస్యలతో ఇచ్చిన వినతి పత్రాన్ని క్షుణ్ణంగా పరిశీలించి ఆ తర్వాత వీటి పరిష్కారాలను గూర్చి ఆలోచిస్తానని ముఖ్యమంత్రి రెవిన్యూ అధికారుల సంక్షేమ సంఘ నాయకులకు చెప్పారు.

## ప్రజా వాకర్స్ సంఘం వైద్య శిబిరం!



నెల్లూరు పొదలకూరురోడ్డులోని ప్రజా వాకర్స్ సంఘం నేతృత్వంలో జడ్పీ హైస్కూల్‌లో ఉచిత మెగా వైద్య శిబిరాన్ని నిర్వహించారు. దీన్ని జిల్లా వాకర్స్ అసోసియేషన్ మాజీ గవర్నర్ దేవరాల సుబ్రహ్మణ్యం యాదవ్ ప్రారంభించారు. డాక్టర్ మంజులమ్మ, డాక్టర్ శోభారాణి, డాక్టర్ కాశయ్య, డాక్టర్ ప్రకాశ్, డాక్టర్ కృష్ణసుమన్, డాక్టర్ పి.వి.రమణి, డాక్టర్ జి.వెంకటేశ్వర్లు 330 మంది రోగులకు వైద్య పరీక్షలు చేసి అవసరమైన వారికి ఉచితంగా మందులిచ్చారు. ఈ వైద్య శిబిరం పేద, మధ్యతరగతి వారికి ఎంతగానో ఉపయోగపడింది. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్షులు సి.హెచ్.భాస్కర్‌రెడ్డి, కార్యదర్శి ఎం.శ్రీనివాసరావు, కోశాధికారి ఓ.సుబ్బరాయుడు తదితరులు పాల్గొన్నారు.

## వడ్డీ రాయితీ అమలు చేయడం లేదు!

బ్యాంకుల నుండి పంట రుణాలు తీసుకొని సకాలంలో చెల్లించే రైతులకు ఒక లక్షలోపు వడ్డీలేని రుణాలు, రెండు లక్షలకు వడ్డీ రాయితీనిచ్చి పావలా వడ్డీ వసూలు చేసే పథకాలు ప్రభుత్వం ప్రవేశపెట్టినా సక్రమంగా అమలు కావడం లేదని నెల్లూరు రైతు సంఘాల సమాఖ్య నేతలు బెజవాడ ఓబులురెడ్డి, వేమారెడ్డి నిరంజనరెడ్డి ముఖ్యమంత్రి దృష్టికి తీసుకెళ్లారు. 3వ తేది నెల్లూరు పినాకినీ అతిథి గృహంలో ముఖ్యమంత్రిని కలిసిన నేతలు మాట్లాడుతూ 2012 అక్టోబర్ తర్వాత పంట రుణాలు పొంది తిరిగి చెల్లించే రైతులు అసలు చెల్లిస్తే చాలని ప్రభుత్వం ప్రకటించగా బ్యాంకర్లు వడ్డీ కూడా అడుగుతున్నారు. 2009-10 నుండి సకాలంలో రుణాలు చెల్లించిన రైతులకు వడ్డీ రాయితీ మొత్తాలు వారి బ్యాంకు ఖాతాలలో జమ అయ్యేలా చర్యలు తీసుకోమని రైతు నేతలు సిఎంను కోరారు.



రైతు లోకం

## సాగునీటి పరీక్ష అత్యంతావశ్యకం!

ఇంతకు పూర్వం సాగునీటి యొక్క నాణ్యతపై ఎక్కువ అనుమానాలు లేక రైతులు నిర్భయంగా వాడుతుండేవారు. కానీ పెరుగుతున్న నీటి కొరత వల్ల భూమిలోని ఎక్కువ లోతుల్లోని పొరల నుండి నీటిని తోడడం వల్ల (బోర్లు) ఎక్కువ లవణాలు నేల ఉపరితలంపై చేరి పంట ఎదుగుదలకు హానికారకమవుతున్నాయి. దీనివల్ల పంటలు సరిగా ఎదగకపోవడమే కాకుండా, నేలలు కూడా బాగు చేసేందుకు వీలుపడని రీతిలో చెడిపోయేందుకు ఆస్కారమున్నది. ఇటువంటి ప్రతికూల పరిస్థితులు ఏర్పడకుండా, క్రొత్తగా త్రవ్విన బోరు బావుల నీరును నర్సరీల కొరకు వేరే ప్రాంతం నుండి తెప్పించి వాడే నీటిని మొదట పరీక్ష చేసి ఆ తరువాత వాడుకోవటం మంచిది.

సాగునీటి పరీక్ష కోసం పొలంలోని బోరు బావి నీటిని పంపుతో సుమారు 20-30 నిమిషాలు వదలిపెట్టిన తరువాత మంచి ప్లాస్టిక్ సీసాలో సుమారు 500 మిల్లీలీటర్లు తీసి సమీప

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

భూసార పరీక్షా కేంద్రానికి పంపాలి. మందు సీసాలను, టానిక్ సీసాలను వాడరాదు. నీటి నమూనా తీసే సీసాను అదే నీటితో 3-4సార్లు కడిగి, ఆ తరువాత నీటి నమూనాతో నింపుకోవాలి. సీసా మూతలో గాలి లేకుండా నీటితో పూర్తిగా నింపాలి.

కాలువలు లేదా చెరువుల నుండి నమూనా నీటిని తీసేటప్పుడు ఒక పెద్ద కర్రకు చిన్న బకెట్‌ను కట్టి ఒడ్డుకు దూరంగా నీటిని తీయాలి. ఆ నీటితో సీసాను 2-3సార్లు కడిగి, ఆ తరువాత నమూనాతో నింపాలి.

సాగునీటి నాణ్యత పరీక్ష కొరకు నమూనాను వెంటనే చేరేటట్లు సమీప భూసార పరీక్ష కేంద్రానికి పంపాలి. నమూనాతోపాటు రైతు పేరు, సర్వే నెంబరు, బోరు లేక కాలువ వివరాలు, గ్రామం, మండల తదితర విషయాలు తెలియజేయాలి.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

# బెయిల్ కోరడానికి భయపడుతున్న జగన్!

సుప్రీంకోర్టులో జరిగిన ప్రస్తావన ప్రకారం మొన్న మార్చి 31తేది తర్వాత వైఎస్.జగన్ బెయిల్ కోరే అవకాశం వుంది. మార్చి నెలాఖరు లోపల దర్యాప్తు పూర్తి చేయ మని సుప్రీంకోర్టు న్యాయమూర్తులు సిబిఐకి సలహా ఇచ్చారు. అయితే మార్చి గడిచి రెండు వారాలు దాటుతున్నా బెయిల్ కోసం దరఖాస్తు చేయడానికి భయపడుతున్నాడు జగన్. బెయిల్ దర ఖాస్తులో ఏ చిన్న తప్పు దొర్లినా ఆ సాకు చూపించి మరొక మూడు నాలుగు నెలలు వెనక్కు నెట్టేస్తారేమో అన్నది జగన్ భయం.

ఇదిట్లా వుంటే, రేపటి ఎన్నికల ముందు కానీ తర్వాత కానీ జగన్ మద్దతు లేదా సహకారం తనకు అవసరం లేదని సోనియా గాంధీ నిక్కచ్చిగా చెప్పినట్లు తెలుస్తున్నది. జగన్ పిన తండ్రి వైవి.సుబ్బారెడ్డి ఇటీవల అహ్మద్ పటేల్‌ను కలిసినప్పుడు ఈ విషయం అర్థమైందట. 2014 ఎన్నికలలో తాను ఒంటరిగా పోటీ చేస్తానని, ఆ తర్వాత కేంద్రంలో జరిగే ప్రభుత్వ ఏర్పాటులో కాంగ్రెస్ నేతృత్వంలోని యుపిఏ కూటమికి మద్దతు ఇస్తానని జగన్ ప్రతిపాదించాడు. ఈ విషయాన్ని ఆయన పలుమార్లు ఢిల్లీ పెద్దలకు చెప్పాడు కూడా. ఇటీవల వైఎస్.విజయమ్మ కూడా ఒక ఇంగ్లీషు పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ ప్రతిపాదనను పునరు ద్ఘాటించారు. వైవి.సుబ్బారెడ్డి ఈ విషయాన్ని ప్రస్తావించినప్పుడు అహ్మద్ పటేల్ పెద్దగా ఆసక్తి చూపలేదట. జగన్‌తో పొత్తు ఏ దశలోనూ తనకు ఇష్టం లేదని సోనియాగాంధీ తేల్చి చెప్పి నందువల్లనే అహ్మద్ పటేల్ ఆ నిరాసక్తత వ్యక్తం చేసినట్లున్నాడు.

# కాంగ్రెస్ పార్టీ పట్ల పెరుగుతున్న ద్వేషం!

## ● జనాభిప్రాయం పట్టని సిఎం కిరణ్.

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ భవిష్యత్తు పట్ల ఆ పార్టీ మంత్రులు, ఎమ్మెల్యేలలోనే తీవ్రమైన ఆందోళన వ్యక్తమౌతున్నది. ఇంది రమ్మ బాటలు, ఇందిరమ్మ కలలు, ఇందిరమ్మ హస్తాలు అంటూ ముఖ్య మంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ఎంత హడావుడి చేస్తున్నా, మండుటెండలో చెమటలు కక్కుతూ వూరువూరు తిరిగి మాయ మాటలు చెప్తున్నా జనంలో మాత్రం ఆ పార్టీ పట్ల ద్వేషభావం పెరుగుతున్నదే తప్ప అభిమానం పొంగుకొని రావడం లేదని అందరికీ అర్థమైపోతున్నది. విద్యుత్ ఛార్జీల పెంపకం, వేళాపాళా లేని కోతలు మూలిగే నక్క మీద తాటి కాయ వలె పడుతున్నాయి. అసలే వైఎస్ మరణం సానుభూతిని జగన్ వ్యామో హంగా మార్చుకొన్న ప్రజలకు కరెంట్ కష్టాలు కాంగ్రెస్ మీద మరింత కోపాన్ని పెంచుతున్నాయి. ముఖ్యమంత్రి మాత్రం జనానికి కరెంట్ వాతలు సగించినట్లున్నాయని, ధరల పెంపకాన్ని వారు ఆమోదిస్తున్నారని బింకంగా మాట్లాడుతున్నాడు. పదేళ్ల క్రితం చంద్రబాబు చేసిన తప్పే ఆయనిప్పుడు చేస్తున్నాడు. విద్యుత్ రంగంలో తన సంస్కరణలను ప్రజలు అర్థం చేసుకొన్నారనే నమ్మకంతో ప్రతిపక్షాలు చేపట్టిన విద్యుత్ ఆందో ళనను చాలా చులకనగా చూశాడు చంద్రబాబు ఆ రోజు. ఇప్పుడు కూడా ప్రతిపక్షాలు ఉమ్మడిగా చేస్తున్న విద్యుత్ ఆందోళనను కిరణ్ కుమార్‌రెడ్డి ఎగతాళి పట్టిస్తున్నాడు. వెటకారం చేస్తున్నాడు. ఈ వైఖరిని ప్రజలు పుండు మీద కారం చల్లడంగా భావిస్తున్నారని ఆయన అర్థం చేసుకోవడం లేదు. ఆనాటికి నేటికి పాత్రధారులు మారారు తప్ప పరిస్థి తులు ఒకేరకంగా కన్పిస్తున్నాయి.

ఈ పరిస్థితుల ప్రభావం తమ రాజకీయ భవిష్యత్తు మీద ఎట్లా వుండబోతుందో తెలుసుకోవడానికి చాలామంది మంత్రులు, సీనియర్ ఎమ్మెల్యేలు స్వంతంగా సర్వేలు జరిపించుకొంటున్నారు. సర్వే అనేది ఇటీ వల ఒక లాభసాటి వ్యాపారంగా మారిపోయింది. ఒక్కొక్క నియోజక వర్గానికి లక్ష నుంచి లక్షన్నర రూపాయలు చెల్లిస్తే సర్వే చేసి పెట్టే సం స్థలు చాలానే పుట్టుకొని వచ్చాయి.

వీటిద్వారా ఇటీవల రాయలసీమకు చెందిన ఒక సీనియర్ ఎమ్మెల్యే తన నియోజకవర్గంలో సర్వే జరిపించాడు. గత ఎనిమిది ఎన్నికలలో ఓట మన్నది లేకుండా గెలిచిన ఎమ్మెల్యే ఆయన. కానీ సర్వే నివేదిక మాత్రం ఆయన్ను చాలా నిరాశ పరచింది. రెండు తరాలుగా తమ కుటుంబ ప్రాపకంలో వున్న తన స్వంత నియో జకవర్గంలో ఇప్పటికిప్పుడు ఎన్నికలు పెడితే తనకు కేవలం 14శాతం ఓట్లు మాత్రమే వస్తాయని నివేదిక ఇచ్చిందట సర్వే సంస్థ. తెలుగుదేశానికి 28 శాతం, జగన్‌కు 50శాతం వస్తాయని చెప్పారు వారు. దానితో ఆ ఎమ్మెల్యే హతాశుడైపోయాడు. రేపటి ఎన్ని కలలో పోటీ చేయకుండా పక్కకు తప్పుకోవ డమే గౌరవప్రదమనే నిర్ణయానికి వచ్చాడు.

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com